# GOSHAVYASA KHANDANAMUNDANAM



BY

Sri K. V. KRISHNAROW BAHADUR,

*Kumararaja of Gampalagudem*

Author of:-

ABHINAVAPANDAVEEYAM, PADUSHA-PARABHAVAM, SRUNGARA THILAKAM

&c. &c. &c.



1919.



PRICE AS. 10.

శ్రీమత్పరదేవతాయైనమః

# గోషావ్యాస ఖండన ముండనము.

శ్రీసీతారామచంద్ర శ్రీరంగభూపాలక భాలేరావుగారి
గోషావ్యాసఖండనమునకుఁ ప్రత్యుత్తరము.

కోటగిరి వేంకటకృష్ణరావు బహద్దరువారిచే
రచింపఁబడినది.

మొదటికూర్పు 500 ప్రతులు.

చంద్రికాముద్రాక్షరశాల
గుంటూరు.

1919.

 [వెల రు 0—10—0

# స్వవిషయము.

---

గుణగ్రాహులారా!

శ్రీసీతారామచంద్ర శ్రీరంగభూపాలక భాలేరావుగారి గోషా వ్యాసఖండనమునకు ముండనము నేను సంవత్సరము తొమ్మిది మాసముల క్రిందటనే పూర్తిఁగావించితినిగాని యెప్పటికప్పటి కేవో యవాంతరములు ప్రాప్తించుటచేత నింతవఱ కచ్చొత్తింపఁజాలక పోతిని. అచ్చటచ్చట భాలేరావుగారి పాక్షికులైన నావ్యతిరేకవాదులు కొందఱు నేనిఁకఁ బ్రత్యుత్తరంబీయఁజాలనని దిసంతులఁ గొట్టుచున్నారనివిని మన్మిత్రులు ముద్రింపుమని తొందరించుటచే నిప్పటికైన నీ"గోషా వ్యాసఖండనముండనము" పద్మనాయకుల కందింపఁగల్గితినని సంతసించుచున్నాఁడను. సాంగోపాంగముగా ఖండనము ముండనముఁ జిత్తగించి చరిత్రకారులు మధ్యవర్తులై సత్యాసత్యముల వెల్లడింతురుగాక యని ప్రార్థించుచు విరమించుచున్నాఁడ.

కంపలగూడెము
30—8—19

ఇట్లు బుధజనవిధేయుఁడు,
కో. వేం. కృష్ణరావు.

---

# శుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 8 | 6 | చరిత్రమాల | చరిత్రరత్నమాల |
| 11 | 25 | వారంఱు | వారందఱు |
| 24 | 9 | నిర్భంధ | నిర్బంధ |
| 33 | 28 | లకు | లగు |
| 41 | 18 | నుండిరి | చుండిరి |
| 50 | 2 | చేయునను | చేయుదురను |
| 54 | 27 | పఱితిని | పఱచితిని |
| 58 | 22 | క్రింద | క్రింది |
| 61 | 17 | పెలకట్టె | పెలకట్టె |
| 62 | 18 | ప్రసరించునో | ప్రసరించెనో |
| 64 | 11 | స్తలము | స్థలము |
| 71 | 15 | సైతమ్ము | సైతమ్ము |
| 78 | 25 | లోన్నవి | లోనున్నవి |
| 80 | 5 | లి | లీ |
| 80 | 7 | న్నారని | చున్నారని |
| 81 | 5 | స్థముల | స్థలముల |
| 82 | 18 | తానే | తానే |
| 89 | 18 | గృహాహే | గృహే |
| | 19 | యాన్తు | యాస్తు |
| 91 | 14 | విమరకు | విమర్శకు |
| 92 | 39 | పర్వతము | పర్వము |
| 94 | 25 | సబాత్రృకము | సభ్రాతృకము |
| 95 | 8 | వంచినను | వశించినను |
| 97 | 25 | రుండిరేమో | వారుండిరేమో |
| 99 | 7 | స్థావరము | స్థావరము |
| 104 | 15 | చువాఁడను | చున్నాఁడను |
| | 17 | సాహాసము | సాహసము |

☞ మఱికొన్ని అర్థానుస్వారశకటరేఫలోపములు కలవు. పాఠకులు యథా యోగ్యముగ సవరించికొనఁ బ్రార్థితులు.

శ్రీశోభనాద్రీశా.

# పీఠిక.

నేనీగ్రంథమునకు పీఠిక వ్రాయఁబూనుటచే మావారిలో చాలమంది కప్రియ మొనర్చినవాఁడ నగుదును. ఐనను ఆబాలమిత్రులగు వేంకటకృష్ణారావుగారి కోర్కె తీర్చుటయేకాక వారికిని, కీర్తిశేషులైన శ్రీతిరువూరు రాజాగారికిని, కొన్ని వత్సరముల క్రిందట జరిగిన ఘోషావిషయిక పత్రికావాదములలో నేనుఁగూడ నొకింతశ్రద్ధపుచ్చుకొని యుంటయు, పద్మనాయకసంఘమున కింతగా సంబంధించు నీవిషయముపై నాయభిప్రాయము వెలిబుచ్చక పెరవానివలె యూరకుండ పాడిగాదని స్నేహితు లనుటయు, నన్నీపనికిఁ బురికొల్పి యందుచే నసంతుష్టులగు మదీయశ్రేయోభిలాషుల ఎడ నన్ను క్షమార్పణాకాంక్షిగాఁ జేసినవి. కాని నేనిప్పుడు పైవేసికొనినపని ముఖ్యముగా నీగ్రంథమునకు పీఠిక వ్రాయుటకావున యాపూచి మొదట వదలించుకొనుటకయి విషయమీపుస్తకమున నెట్లు చర్చింపఁబడినదో తెల్పికొని తర్వాత విషయముఁగూర్చి నాయభిప్రాయము విశదీకరించెద.

ఈవ్యాసములలో రెండుపక్షములవారు వ్రాసినవి మొదటినుండియు చూచుచుంటిని. ఇరుపక్షములవారి యుద్దేశములును, సదుద్దేశములే. ఇరు తెఱఁగులవారు సంఘమునకు మేలెంచువారే. ఒకరు. (వారి యభిప్రాయానుసారము, సంఘముఁబట్టి పీడించు దురాచారము మాన్పింపఁగోరుదురు. వేరొకరు (వారియభిప్రాయప్రకారము) చాలకాలమునుండియు వచ్చునాచారము కాపాడ గోరుచున్నారు. రెంటిలో నీగ్రంథమున వేంకటకృష్ణారావుగారు మొదట చెప్పఁబడినది. అనఁగా ఘోషావిసర్జనీయమను యభిప్రాయము వెలిబుచ్చుచు ఘోషా (ఇప్పుడు చరింపఁబడుపద్ధతిని) మన దేశమున పూర్వ మాచరింపఁబడలేదనియు, మహమ్మదీయపరిపాలనమున స్త్రీలకుఁ గలిగిన యిబ్బందివలన నీయాచారమునకు గడఁగవలసి వచ్చెననియు, అనేకాధారములఁ జూపుచు, సమర్థించిరి. మఱియు, ఖండనవ్యాసకర్తగారగు శ్రీ పెద్దపవని రాజావారి వాదములను చర్చించి వారుచెప్పినయాధారములు గ్రంథస్థములైనను సందర్భానుసారములు కావనియు, లెస్సగ ఖండించిరి. స్వయముగ వేంకటకృష్ణారావుగారు నూతనాధారములఁ జూపి తమవాదము చాలవరకు బలపరచిరని చదువరులే తెలిసి

కొనగలరు. కాని తాము కొన్ని యాధారములు, నవలలు, నాటకములు, మొదలగు పుస్తకములనుండి గైకొనుటచే అవి వారికంత సహకారులు కాఁజాలవు. నవల లేక నాటక మేయే భాషలోనున్నను, యెప్పుడు వ్రాయబడినను, యెంతటి విజ్ఞాని వ్రాసినను, దానియుపయోగ మంతయు పాఠకుల-లేక ప్రేక్షకుల-రంజింపఁజేయుట; ఆయా పాత్రలు చెడకుండునట్లు భద్రపఱచుట; అవి యింతవరకే కాని యాపైన గ్రంథస్థమగు ప్రతివాక్యముయొక్క నిజానిజములకు పూచీ పడజాలవు. ఇఁక పురాణాదులందన్ననో, విమర్శించి సందర్భము సరిగానున్న నాధారము గైకొనవచ్చును అనగా యేపురాణమందైనను రాజుసధర్మము వివరించునప్పుడు చెప్పఁబడు పరస్త్రీగ్రహణ మావశ్యకమను వాక్యము చూచి, సందర్భము విచారించకుండ పరస్త్రీలను బట్టుట ధర్మమనఁదగునా? అదియుఁగాక ఒకటి యేటికీడ్చిన వేరొకటి కోటికి దీయుచు పరస్పర సామరస్యము చాలవరకు లేకుండు పౌరాణికాధారములకంటె, యేశాస్త్రమునందైన యాధారము వెతకుట మేలు. అట్టిశాస్త్రము సాంఘికావస్థను నిర్దేశించు ధర్మశాస్త్రమై యుండవలెను. ఏలననఁగా వ్యాకరణశాస్త్రాదులలో మనప్రస్తుత విషయమునకు సంబంధించిన వాక్యములున్నను, వాటియుపయోగ మన్యథా నిర్దేశింపబడియుండును. ఇఁక ధర్మశాస్త్రములందున్నది లేనిది సంస్కృతము బాగుగ నేర్వని నాకుఁ దెలియదు గావున పెద్దలు తెలిసినవారు పరిశీలింప ప్రార్థితులు. కావున నిట్టి యాధారముల చెప్పుటకై వ్యాసకర్తలు ఏపక్షమువారైన సరియే, తమకు తోచినవి యుదాహరింపవలెను గాని పద్దనేయే శాస్త్రిగారినో యడిగి యాయన పేర వదల్చుకొనుటకై, తమకు తోచినదేదో చెప్పి దానినే యుదాహరించి హాస్యాస్పదులు గాకుందురుగాక! మన కృష్ణారావుగారి గ్రంథమున నింక ననేకములు తెలిసికొనదగిన విషయము లున్నను గ్రంథవిస్తరభీతిచే, నింతటితో, విరమించి మొదటచెప్పినప్రకారము ఘోషాపై నాకుఁగల యభిప్రాయము క్లుప్తముగా సోదరమహాజనులకు విన్నవించుకొనుచున్నాడ. మనము కాదు కాదు మన స్త్రీలు ఘోషా పాటించుచున్నారు గదా! ఇది.

(1) ఎంతకాలమునుండి వచ్చుచున్నది?

(2) ఇంతకాలమునుండియుఁ మనకిది ఏబాధలేకుండఁ జేసినది? అనఁగా ఎట్లు ఉపయోగమైనది?

(3) అట్టిబాధలు మనకిప్పు డున్నవా లేవా?

ఈప్రశ్నల కుత్తరమిచ్చిన నాయభిప్రాయము తేటపడినట్లగును. కాని ప్రపంచ మంతయు మంచిచెడ్డలు రెండును మిళితముగ కలసియుండుటబట్టి ఏపక్షము విచారించినను కొంతమేలు కొంతకీడు కనుపడకమానదు. ఘోషా యెంతకాలమునుండి వచ్చుచున్న దను ప్రశ్నకు యిదివరకే యనేకాధారములతో నిరుతెరంగులవారు నడిచిరి గావున దానిని మరలచర్చించుట యనావశ్యము. ఎంతయో కొంతకాలమునుండి వచ్చుచున్నది. ఇంక నది యుపయోగకరమైనరీతి నెల్లరకు విదితమే. దేశమల్లకల్లోలముగా నున్నప్పుడు స్త్రీల మానమును స్త్రీవేషధారులైన కొందఱు పురుషుల గౌరవమునుంగూడ గాపాడినది.

ఇంక నిప్పుడు దేశము శాంతిగా మంచిదొరల పాలనమునందున్నదిగదా? ఘోషా మనము తీసివేయవచ్చునా? అని నన్ను నేనే ప్రశ్నించుకొనెద. దేశము శాంతి వహించినది. కాని కొందఱు వ్యాసకర్తలు స్త్రీల మానము లేగాక ఘోషా స్త్రీల శీలమునుంగూడ రక్షించినట్లు చెప్పినారు. అనంగా స్త్రీలు స్వయముగ నన్యాయవర్తలు గాకుండ నుంచినదట; కాబట్టి యీయుద్దేశము ప్రకారము మనము మన స్త్రీలతో నిట్లనుచున్నాము. "మీరు మాకు కావలసినవారు మిమ్ము మేము నమ్ముట లేదు. కాబట్టి యీనాలుగుగోడల నడుమనుండి వెలికి రావలదు" వారబలలు కావున అట్లుండక తీరదు. హరి, హరి, తుదకు మనదేశములో దాంపత్య స్నేహము నాలుగు గోడలనడుమ దాచిపెట్టినగాని దక్కనంతటి దుస్థితికి వచ్చినదా! దేహముపోయినను ప్రాణముతో శాశ్వతముగ నుండునట్టి సతీపతుల సంబంధము తెరమాటున నణచిపెట్టిన గాని లేకుండపోవునట్టి హీనస్థితికివచ్చినదా! ఆమాత్రము నిశ్చయములేని నిర్మలము గాని భార్యాభర్తల బాంధవ్యములనైన నమ్మకములేని యీసంసార మేడ్చుటకంటె మనమందఱ మొక్కసారిగా వల్లభాచార్యమతము పట్టుట మేలు. మఱియు నొక కవిశేఖరుం డిట్లు వ్రాయుచున్నాడు.

తే॥ గీ॥ మనదు హిందు దేశఘనత యంతయుంబోయె
ధనముపోయె కీర్తిధనముపోయె
మనకుంగల్గినట్టి మహితధనం బెల్ల
తరుణుల మగవారితనమె యుండె॥

కాబట్టి హిందూదేశ మెన్నియిక్కట్టులపాలయినను అంతు పురుషులమగు మనధైర్యసాహసములు, జవసత్వములు ఎట్టిమార్పులనందినను, మన స్త్రీలపాతివ్రత్యము

నకు మన స్త్రీలసచ్ఛరిత్రకు మన స్త్రీలమగసాలితనమునకు వేదకాలమునుండి యిప్పటి వరకు నేఁటివరకు యీనిమిషమువఱకు మలినములేదు. మార్పులేదు. నిస్సందేహము. కావున మన స్త్రీలు వ్యభిచరింతురను భయముచే ఘోషాలోఁ బెట్టితిమనుమాట మన మనరానిది. పరులు వినరానిది. మనకున్న స్వల్ప గౌరవమునకు స్వాభిమానము నకును వేయేల? హిందూదేశము హిందూదేశముగా నుంటకును మన స్త్రీల పవిత్రా చరణమే కారణము. అట్లనుటచే మనము ఘోషాతీసివేయవచ్చునా! ఏమాటచెప్పుటకును కొంచెము వెనుకటిసంగతి తేవలసియుండును. మనహిందూదేశము శాంతివహించిన దంటిమి. ఔను నిజమే. కాని దుండగులసంఖ్య తగ్గినదా? తగ్గినది. కొంతవరకు బందిపోటుగుంపులు, నిరంకుశాధికారులు తగ్గినారు కాని తమ కుత్సితవివేక ముచే దొరతనమువారి శాసనములకుఁ జిక్కకయో, లేక యాశాసనముల భావము త్రిప్పి తమ కుతంత్రములకు సహాయముచేసికొనియో, పరధనపరదారాపహరణ మవ్యా హతముగ చేయుదుష్టులున్నారు; ధనము గాని, దారను గాని, యర్పింపనిచో నుద్యో గమున సహాయముసేయక జీవనాధారము భంగపరచుటకు జనులున్నారు. పగలు పరమపావనులవలెవర్తించి చీకటిరేల మోటారుబండ్లలోలేచి, యొంటిగాచిక్కిన పడుచుల నల్లరిచేయు నధములున్నారు. కాబట్టి దేశమున నబలలకు భయములేక పోలేదు. మనకాంతలట్టిభయములకు వెరువవలసిన సమయము దాటినచో మనము ఘోషాతీయవచ్చును. మన స్త్రీలకు మనతోపాటు కొంతవరకు విద్య, ఆత్మగౌరవము, దేశాభిమానము, నేర్పింపవలెను. మనయాడుబిడ్డల రజస్వలలౌటతోడనే పెద్దవారని యెంచక వివాహముచేసినను, చేయకున్నను, వారికి లోకజ్ఞానము పూర్తిగవచ్చువరకు విద్యాభ్యాసము చేయింపవలెను. ధైర్యసాహసములు అవసరమగునప్పుడు విడువకుండు నేర్పు మన స్త్రీలకు కొంతవర కుండవలెను. ఏలననఁగా నీయుదాహరణ మొకటి చిత్తగింపుడు. ఒకదుష్టుఁ డొకచోట దాఁగియుండి దారినే పోవుచున్న నొక హిందూబాలికను డాసి యదలించెను. ఆబాల భయముతో కెవ్వుమని యార్చి గడగడవణకుచు, వేలబడుటకు సిద్ధమై,యంతలో నొకపుణ్యాత్ముఁ డడ్డుప డగా యపాయముదాటెను. మరియొకనాఁ డాదుష్టుఁడు మఱల నాదారినొక 'యూరో పియన్'యువతి పోవుచుండ నామెం డాసి యదలించెను. అది వాఁడుదగ్గరకువచ్చువర కూరకుండి,తటాలున వంగి తనమోజాయూడలాగి వాఁడిగైన మోజామడమతో వాని పండ్లూడి ముక్కున నెత్తురుగారునట్లొకటి యనుగ్రహించెను" చూచితిరా! మఱియు

దోషవిశేషము. మనజనులలో, ననుమానపిశాచబాధ హెచ్చు. ఒక స్త్రీ యొక పురుషుఁడు మాట్లాడినసరి, వారిద్దరకు రంకు గట్టకమానరు. కాబట్టి తుదకు నేఁజెప్పఁబోవు నదేమనగా దేశము సంఘము నౌన్నత్యమునకు రావలెనన్నయెడల స్త్రీపురుషులకు సమానస్వాతంత్ర్య ముండవలసినదే. అనఁగా పురుషులకులేని ఘోషా స్త్రీలకవసరము లేదు. కాని స్త్రీలకంతటి స్వాతంత్ర్యమిచ్చుటకు పూర్వము వారికి సంఘమునం దాత్మగౌరవము గాపాడుకొనఁదగిన లోకజ్ఞానము, విద్య, దేశభక్తి, ఇత్యాదులు, నేర్పవలెను. అప్పుడు ఘోషాయవసరములేదు. అవసరములేని దుండుమన్న నుండదు. “పాతివ్రత్యముగలిగిన। నాతియనఁగ దైవమన, జనస్తుత! వేరే। యాతతప్రఖ్యాతి యశఃఖ్యాతులు సద్భార్యవలన గాదెకలుగు”॥ భాగవతము. ఇట్టి మన స్త్రీలను నమ్మ గూడదనుటకంటె స్వామిద్రోహమున్నదా?

ఇట్లు,

నూజవీడు,
ది 20-8-1918.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరు,
జమీందారు వుయ్యూరు.





శ్రీమత్పరదేవతాయైనమః.

# గోషావ్యాసఖండన మండనము.

ఉ॥ వ్రాసిరి ఖండనంబుఁ బ్రతిపక్షులు దానికి మండనంబు నా
చే సమకూర్పఁగాఁబడె వచింపుఁడు రెంటి నిజత్తగించి యే
దో సువిమర్శనంబు నిజముండిన పట్టున సల్పి బంధితా
వాసము వెల్మకాంతలకుఁ బాపఁదలంపుఁడు పద్మనాయకుల్॥

పద్మనాయక సోదరులారా!

నలనామసంవత్సరాంధ్రపత్రికా సంవత్సరాదిసంచికలో వెలువడిన నా * గోషావ్యాసముపై ఖండనము పింగళసంవత్సర భాద్రపద బహుళపక్షములో బయలువెడలినది. విమర్శరూపమున మాకతిథులగు ఖండనగ్రంథకర్తలకు స్వాగతమొసంగుచున్నాఁడను. రాజా సీతారామచంద్ర శ్రీరంగభూపాల భాలేరావుగారి విమర్శ మెంతమాధార విరహిత విషయభూయిష్ఠమైనను బ్రత్యుత్తరంబిచ్చుటకు మామిత్రుల ప్రోత్సాహమే హేతువు. భాలేరావుగారు ఖండనమునకుఁ బ్రారంభమున వ్రాసిన పద్యములో

... ... ... ... ... "పద్మనాయక
స్త్రీసముదాయముల్ గరుణచేత బజారున కీడ్వకుండగన్"

అని గిలికిరి. ఇది కడుసాహసము. ప్రకృత సంవత్సరాదిసంచికలోని

---

* వాచకలోకర్యార్థమై గోషాశబ్దము సమాసములలోఁ బ్రయోగించితిని. ఇందులకుఁ బూర్వకవులే మార్గదర్శకులు

నాగోషావ్యాసమునకు రెండుమూఁడేండ్లక్రింద నేను "అభినవసరస్వతి" యను మాసపత్రికలోఁబ్రచురించిన వ్యాసములో గోషాతొలఁగింపు మనినంతనే మనస్త్రీలనుహూణాంగనలరీతిఁబురుషులబుజములకు రాచి కొని చిందులాడుమని నాయభిప్రాయము కాదనియుఁ(గావలయు చో నిట విస్తరింపఁబడుననియు)అనఁగా గోషా యెంతవఱకు విసర్జనీయమను నాయభిప్రాయమును యెవరేని కోరినచో వ్రాయఁబడుననియు నేను వ్రాసియుండ-అన్యాయముగ-అకారణముగ-అనాలోచనముగఁ- బద్మనాయకస్త్రీసముదాయమును బజారున కీడ్పించుటకు మనమిత్రులైన భూపాలకభాలేరావుగారు వెనుదీయరైరి. దీనిచే ఖండనగ్రంథకర్తగారి లేఖిని యెంత యనాలోచనముగఁ జిందులువెట్టునది పాఠకు లెఱుంగక పోరు. భర్తల యండనుండు నండజయానలకు గోషాతోఁ బనియుండదని నాయభిప్రాయము వెలిబుచ్చియుండఁ బూర్వోత్తరసందర్భములఁ గనిపెట్టక నాయభిప్రాయము గ్రహింపక-పద్మనాయకస్త్రీసముదాయమును బజారున కీడ్వవద్దని యెవరికిబోధించుటకు భాలేరావుగారుసాహసించిరో తోఁచదు. ప్రకృతాంశమునకు వత్తును. నావ్యాసములోఁ గలిగిన సందేహములను భాలేరావుగారు విమర్శింప సమకట్టినారఁట. నల్లని యద్దముల సులోచనముల ధరించిచూచినచోఁ బ్రపంచమెల్ల నల్లఁగఁగనుపించునటుల నభిప్రాయభేదమున్న భాలేరావుగారికి నావ్యాసమంతయు సందేహముగనుండుటలో నాశ్చర్యమేమియు లేదు. కాననే విమర్శమున కుపక్రమించి యుందురు. విమర్శమువలనఁ జర్చనీయాంశములు వెలువడుటయు నుభయపక్షములలో సత్యముపద్రష్టలకు సులభముగఁ దోఁచుటయు సహజముగాని శ్రీభాలేరావుగారి విమర్శముమాత్ర మట్టిగుణవంతము గాదని వ్రాయుటకుఁ జింతించుచున్నాఁడను. చూడుఁడు. భాలేరావుగారు తమ ఖండనములో "పూర్వమునుండి వచ్చుచున్న యాచారమే గోషా శబ్దమున కర్థద్యోతకము" అని వ్రాసిరి. ఇందలి పూర్వమునుండి వచ్చుచున్న యాచారమేదియో అర్థద్యోతక మేదియో నాకర్థముగాకున్నది. అంతఃపురము శుద్ధాం

తను అవరోధము గోషా సమానార్థద్యోతకములు కావను నావాక్యమునకుఁ బ్రత్యుత్తరమా ? యిది. ఎటులగును ?— కాదు. కాకున్న దీనికన్వయమే లేదు. ఈయనన్వయ శూన్య వాక్యములకేమిగాని మఱి యొక విచిత్రాంశమును దిలకింపుఁడు. ఖండనమున రావుగారు "శబ్దశాస్త్ర మనంతమైనందున మనము జూచుచుండు నిఘంటువులందుఁ గానంబడనంతమాత్రమున నాయర్థము (గోషాశబ్దమునకుఁ) గాదనుట సహేతుకము కాఁజాలదు" అని వ్రాసిరి. ఎందువలనఁ గాఁజాలదో నాపూర్వ వ్యాసమున †5,6 పుటలఁజూచినఁదెల్లము కాఁగలదు. ఖండన గ్రంథకర్తగారు చతుస్సముద్రములన మూఁడనుకొని రెండుఁజూపఁ బోయి యొకటిఁ జూపించినట్లు లేమో వ్రాయనుద్దేశించి యేమోవ్రాయు చున్నాఁడననుకొని యేమో వ్రాసినటు లున్నది. తాము సహేతుకముగ వ్రాయక ప్రతిపక్షులవి సహేతుకములు కావను వీరివ్రాఁత గురిగింజ క్రిందనల్పు వృత్తాంతము స్మృతికిఁ దెచ్చుచున్నది. నేను గోషా శబ్దమన్యదేశీయమని నిర్ధారణచేయుటకు ఈశబ్దమును విమర్శించి ఫలితాంశము వెల్లడించితిని. ఇది వీరికహేతువయ్యెనంట. ప్రకృతమున్న దేశభాషా నిఘంటువులలో లేక పూర్వకవు లెవ్వరు తమగ్రంథములోఁ

---

† గోషావ్యాసములోని 5-6 పుటలలోని ప్రకృతాంశము.

ఘోషాపదము హూణాంధ్రసంస్కృత భాషలలోఁ బ్రకృతార్థమును బోధింపదని పలువురు పండితులవలననే గాక నాస్వల్పవైదుష్యముచేఁగూడ గ్రహించితిని... ...ఈవిషయములోఁ బారసీకపండితుల యభిప్రాయముఁ గోరఁగా ఘోషాయను నుచ్చారణ తప్పనియు సున మేయర్థమున ఘోషాయని యుచ్చరించుచున్నారమో యాయర్థమునఁ బారశీకభాషలో గోషాయని యుచ్చరించుచుండిరనియుఁ దెలియఁ బలికిరి. ఇప్పటికేఁబదిసంవత్సరముల నాఁటి పారశీక నిఘంటువైన "గియాసుల్లోగాత్"లోను. ఇప్పటి కిరువది సంవత్సరముల నాఁటి "లోగాతుకిష్వరీ"యను పారశీకనిఘంటువులోను గోషాయనుశబ్దమునకర్థముమూలయని యున్నది .........కాని స్త్రీలు పురుషులకుఁగానరాకుండుటను దెలుపుటయందు మాత్రము విచ్చలవిడిగవ్యవహరింపఁబడుచున్నది. ఉర్దూలోఁగూడ నీశబ్దమీయర్థముననే వ్యవహరింపఁబడుచున్నది...

ప్రయోగింపకయున్న యీగోషాశబ్దము స్పష్టముగ నితరభాషలలో నున్నదని తెలియుచుండ నా వ్రాఁత సహేతుకము కాదనుటయే సహేతుకముకాదు. ఈవిషయమింతకుమున్నె దత్ప్రత్యుత్తరమగుటచేతను దానిని ఖండనగ్రంథకర్తగారు తిలకించి జాఱవిడచుటచేతను మఱలనీచర్చ యనవసరమని వదలుచున్నాఁడను. * "గీర్వాణమున విశ్వగుణాదర్శగ్రంథకర్త ప్రపంచ గుణదోషములను నిష్పక్షపాతముగ గ్రహింపఁబూని క్రమక్రమముగ గుణప్రశంసనువీడి దోషబాహుళ్యముగనె గ్రంథము పూరించుటవలన తత్ఫలముఁగూడ ననుభవించెనని యాకవి చరిత్రంబువలన తెల్లంబగుచున్నద"ని బాగుగనెఱింగి వ్రాసిన భాలేరావుగారు నిష్పక్షపాతబుద్ధితో నావ్యాసము విమర్శింపఁబోయి క్రమ క్రమముగ గోషాయాచారమందుఁగల దుర్గుణంబుల గణింపక గుణములారోపించి గోషానిర్మూలమున కడ్డుపడుటయు నట్టిదని వేఱుగ వ్రాయ నాలేఖనికిఁబనిలేదు. ఈయంశము నాకొఱకు వ్రాయఁబోవఁదమపైనె బడినదని భాలేరావుగారికి మనవిచేయు చున్నాఁడను. "విమర్శకులు:- పూర్వాను పూర్వక్రమాగత మార్గంబును నిరోధింప సమకట్టినవారు బహుస్వల్ప సంఖ్యాకులని తోఁచెడిని" అని వ్రాసిరి. ఈముక్కకాధారమున్నదా? ఇంతవఱకీచర్చలోఁ బత్రికావాదమున బహునామములతోఁ బరగిన హితవాదిగారును నేఁడు బైటఁబడిన భాలేరావుగారుఁదప్ప శేషించిన పద్మనాయకసోదరులు నాతో నేకీభవించిరిగదా! ప్రకృత వాదప్రతివాదములలో బహుజనాభిప్రాయము నాదైనప్పుడు వీరీరీతి హేతువిహీనపు వ్రాఁతల మానుట సమంజసము. మఱియు సహేతుకములైన నావాక్యముల నిర్హేతుకములనుచు విమర్శకులు హేతువిహీనముగ వ్రాయసాహసించుట "వెఱ్ఱి కుదిరె రోఁకలిఁదలకుఁ జుట్టు"మనినటులున్నది. ప్రథమమున ఖండన గ్రంథమున విమర్శకులు నిష్పక్షపాతముగ నావ్యాసము విమర్శింపఁ

* "ఈగీర్వాణమున" యను పదమన్వయమున కడ్డుపడుచున్నది. పైవెచ్చు సందర్భకావ్యము-భాషావిమర్శము ప్రకృతముకాదు.

బ్రారంభించియుందురుగాని రానురానుమాత్రి మాయూహా నిలుపు కొనలేకపోయిరి. ఇందులకు దృష్టాంతరములు సమయానుసారముగ ముందుచూపఁబడును. శ్రీభూపాలకభా లేరావుగారిని వారిపరమాప్తులు నా వ్యాసమునకు విమర్శము వ్రాయఁబురికొల్పి నాకుఁబరమోపకార మొనరించిరి.

" తఱచినను గాని పాలచేకురదు వెన్న
కఱఁగినను గాని పసిడికిఁగాంతి రాదు
ఒఱచినను గాని మణికైన నొఱపు రాదు"

అను సుకవి వాక్యప్రకారము వాదప్రతివాదములలోఁ గాని గోషాయాచారమునందలి గుణాగుణములు తేలవు. మేడపైఁ గాకి వ్రాలినప్పుడుగదా మేడధావళ్యము వెల్లడియగుట. తురుష్క పరి పాలనకుఁ బూర్వ మీ యాచారము లేదనుట నిరాధారమని విమర్శ కులు నా వ్యాసమును దమకు వీలుగఁదోఁచిన భాగములు మాత్రమే చదివి యుందురని వ్రాయుటకు సాహసించుచున్నాఁడను. లేకున్నచో నా గోషావ్యాసము 14 వ పుటలో.

ఉ॥ కామినుఁ లింటనుంచుటకుఁ గారణముల్ వివరించువాఁడ నే
నేమసియన్న దుష్టులగు నెవ్వరిచేతను హానిలేమి యే
సామజయాన సుందరి నిజంబుగఁగన్పడినంత నామెపైఁ
బ్రేముడిఁ జూపిరే తురకబిడ్డలు నాఁ డుదయించె గోషయుల్॥

అని బందరు శతావధానమునుండి యాధారముఁ జూపిన శ్రీ కింకవీంద్రఘటాపంచానన బాలసరస్వతి బాలకలానిధీత్యాది బిరు దాంకితు లగు శ్రీ తిరుపతి వేంకటేశ్వర మహాకవుల పద్యముచేరువ కేని యీగ్రంథకర్తగారేల పోకుందురు? తమ కనుకూలమగునని తామనుకొనినవి మాత్రముచేకొని యనుకూలములు కావనుకొనిన విషయములజోలికి రాకుండుట నిష్పక్షపాతమగునా? సోదరులారా! వీరి నిష్పక్షపాత విమర్శమునకు తేలినదిదుడీ. ఇట్టిలోపములఁ గప్పిపు చ్చుటకేఁ గాఁబోలు విమర్శకులు తమవిమర్శము నిష్పక్షపాతమని

వ్రాసికొనుట. "ఏన కేనాప్యుపాయేన ప్రసిద్ధః పురుషో భవేత్" అను శ్లోకమే యీవిమర్శకుఁగారణమని ప్రకృతాంశమువలన ద్యోతకమగుచున్నది. పరిశిష్టన్యాయ ప్రకారము నాయాధారము నంగీకరించి నటులే పాఠకులు గ్రహింతురుగాక.

నావ్యాసములోని "సీత, ద్రౌపది, దమయంతి, ప్రమీల, వీరమాత, యిందిర, వీరాబాయి మొదలగువారు గోషా లేకుండిరను నంశమునుజూచి ఖండన గ్రంథకర్తగారు నాయాశయము గగనకుసుమమయ్యెననియు, నాపోవుమార్గ మాధారరహితమైనదనియుఁ, దమ గ్రంథమున వ్రాసికొని పప్పులోఁగాల్వేసిరి. అది సూత్రప్రాయవ్యాసమగుటచే నందాధారముల సమకూర్పనైతిని. ప్రకృతమీయాధారము లేకాక మఱికొన్ని యాధారముల నిటఁ బొందుపఱచుచున్నాఁడను. చిత్తగించి నాయాశయము గగనకుసుమ మందురో విమర్శకుల వాక్యము శశవిషాణమందురో యెఱుఁగఁగోరి ప్రాజ్ఞుల నడుగుచున్నాఁడ. ధౌమ్యుఁడు పాండవులకు సేవాప్రకారములఁ జెప్పుఘట్టమున వ్యాసమహర్షి.

నైషాం దారేషు కుర్వీత మైత్రీం ప్రాజ్ఞః కదాచన

మహాభారతము విరాటపర్వము ౪ వ అధ్యాయము.

ప్రాజ్ఞుఁడెవ్వఁడును వారి (రాజుల) భార్యలతో స్నేహితముఁజేయరాదు అని తాత్పర్యము. గోషాయాచారమానాఁడున్న సీవాక్యముతోఁ బనియేమి? స్త్రీపురుషాన్యోన్యావలోకనమే లేనప్పుడు స్నేహితమే సంభవింపదు. అంతఃపుర స్త్రీకిఁ బరపురుషునిచూచుటయే తటస్థింపనప్పుడు వ్యాసవాక్యంబు హాస్యాస్పదంబు కావలయును. ఖండనగ్రంథకర్తగారు స్థూలదృష్టితో నంతరార్థమైన నిజము బోధింతురుగాక.

శ్రీమతి భండారు అచ్చమాంబగారు "విక్రమునికాలమున స్త్రీలకు రాణివాసము లేకయుండెనని యనేకప్రమాణములవలనఁ

గానంబడుచున్నద”ని అబలాసచ్చరిత్రరత్నమాల 297 వ పుటలో వ్రాసిరి. గోషాకంటె నెన్నిమడుంగులో అస్వాతంత్ర్యవిహీనమైన రాణి వాసమే లేనికాలమున భాలేరావుగారు గోషాకలదని శాసింపఁ బూనుట విరుద్ధము సాహసమని ప్రత్యేకించి వ్రాయఁ బనియుండదు.

బ్రహ్మశ్రీ ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణకవిగారు తమ రసపుత్రవిజయనాటకమున విమలాకేసరుల సంభాషణ మీఁదిగువరీతిగ వ్రాసిరి. (క్షత్రియకన్యయై విమలసహోదరియై ఔరంగునిబెండ్లాడిన కేసరి విమలనుద్దేశించి సంభాషించుభాగములో)

కేస- కూపస్థమండూకమువలె నంతిపురముఁ బాయకుండుదానికి

మర్యాదతీరులును నాగరికతరీతులును నేమితెలియును.

విమ- నత్తగుల్లలోని నత్తవలె నత్తవాడింట క్రొత్తఘోషాపద్ధతి

నత్తియుండు మత్తకాశినులకుగాక నాగరికత మాకెక్కడిది”

అనికలదు. దీనింబట్టియైన గోషాయాచారము తురుష్కులదే యనియు నదియునంతిపురమునకు సమానార్థద్యోతకము కాదనియు ఖండనగ్రంథకర్తగారు రొప్పికొని తెలివలయును. గోషాపద్ధతి రాజపుత్త్రులదనియుఁ దురుష్కులే హిందూదేశమునకు వచ్చినతరువాత హిందువులనుజూచి నేర్చికొనిరనియు వాదించు ప్రతిపక్షుల వాదమునకుఁ బైయాధారము వ్యతిరేకమని పాఠకులు గుర్తింతురుగాక.

అంతఃపురము, అవరోధము, శుద్ధాంతము, గోషాకు సమానార్థద్యోతకములు కావనిగూడ ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణకవిగారి మాటలాధారమొసంగుచున్నవి. ప్రకృతాంశము బలపఱచుట కబలాసచ్చరిత్రరత్నమాలనుండి మఱికొన్నిపంక్తుల నిచ్చుట నుదాహరించుచున్నాఁడను.

“తండ్రి, అన్న, భర్త మొదలగువారు చూచుచుండఁగ బిడ్డ, చెల్లెలు, భార్య, మొదలగువారి కత్యంతహాని సంభవించుచుండెను. సురాజద్దౌలా రాజ్యమునందలి యేస్త్రీని నేవేళ రాజభటులు గొని

పోవుదురోయని స్త్రీలందఱును వెలుపలి కెన్నఁడును రాక యిండ్లలోనే యెప్పుడును డాఁగియుండుచుండిరి......దుష్టులగు మ్లేచ్ఛులభయముచే నట్లువంగదేశస్త్రీలు రెండుమూఁడు శతాబ్దములవఱకు నుండుటవలనఁ గొన్ని దినములకదియే ముఖ్యధర్మమని వారికిఁ దోఁచెను. పిమ్మట నీ ఘోషాపద్ధతియే సభ్యస్త్రీల కుచితమనియు నదిలేనిస్త్రీలు నీతిమాలిన వారనియు వారు సిద్ధాంతీకరించిరి. (అబలాసచ్చరిత్రమాల మూఁడవ కూర్పు ప్రథమసంపుటము 275 పుట) ఇప్పటికైన ఖండనగ్రంథ కర్తగారు తమకుఁజిక్కిన యాధారములు మేముదాహరించునంశములు నొకసారి తిరుగవేసిచూచి మనసునకుఁ బట్టించుకొని శ్రీమతి భండారు అచ్చమాంబగారి చరిత్రవాక్యముల యథార్థము గ్రహించి వారి పూర్వాభిప్రాయము మార్చుకొందురుగాకయని ప్రార్థించుచున్నాఁడ. తురకలు గోషామనవలననే యభ్యసించిరను నిరాధారవాక్య మీయచ్చ మాంబగారి వాక్యరత్నముచే విధ్వస్తము చేయఁబడినది. మఱియు నచ్చమాంబగారి గోషాపద్ధతిప్రవృత్తి కారణముఁ దెలిసికొని యాంగ్ల ప్రభుత్వమున స్త్రీలకెట్టిబాధయు లేమిగనక గోషాయను కారాగృహ వాసమునుండి తమ స్త్రీలను విడిపించెదరని తలంచుచున్నాఁడను. నిప్పుడుపాతబుద్ధివహించి తమవాదమున వదలి నిజానిజములరసి నేను జంపినపులి తోఁకతోఁదొమ్మిదిబారలను వ్యర్థవాదమునకుఁదిగక ఖండనగ్రంథకర్తగారగు శ్రీరాజావారు తనయభిప్రాయముమార్చుకొని సత్యమును సాటిపద్మనాయకులకు బోధింతురని నమ్ముచున్నాఁడను. ఇంతియగాక మఱియొకయాధారముఁ జూపెదను. బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ విద్వద్వతంసునిచే యథామాతృకముగ గీర్వాణభాష నుండి యాంధ్రీకృతమైన కథాసరిత్సాగరము రెండవకూర్పు ప్రథమ సంపుటము 645 పుటలో "ఇట్లుశృంగభుజుఁడు భార్యతోఁగూడ నాశ్చర్యమైన యాగుఱ్ఱముమీఁద సవారిచేసి త్వరగా వర్ధమానపురముఁ జేరెను" అనివ్రాయఁబడియున్నది. ఈశృంగిబేరుఁ డొకప్రభువు. గోషా కుపకరించు నాందోళికలున్నవని వాదించునటుల గోషాకుపకరించు

గుణ్యములుగూడఁగలవని వ్రాసి భాలేరావుగారు పరిహాసపాత్రులు కాకుందురుగాఁత. అయాభాగములు చక్కఁగఁ జిత్తగించి తమ పూర్వాభిప్రాయము మార్చుకొనఁ బ్రార్థితులు. మా భాలేరావుగారు వచించినటులే "సుప్రసిద్ధాంధ్రదేశేతిహాసజ్ఞులగు" శ్రీచిలుకూరివీరభద్రరావుగారు తమ ఆంధ్రులచరిత్రము మధ్యమయుగము 306 పుటలోఁ గాకతీయరుద్రమదేవిచరిత్రమున "ఈమె రుద్రదేవమహారాజను నామముతో వ్యవహరింపఁబడుచుండెను. ఈమెయెప్పుడును పురుషవేషముతోనే కొలువుకూటమునకేతెంచి మంత్రులతో రాజ్యాంగవిషయములనుగూర్చి ముచ్చటించుచుండెనని తెలియుచున్నది" అనివాక్రుచ్చిరి. కాఁబట్టి విమర్శకులీభాగముఁ జదివియున్న స్మృతికిఁ దెచ్చుకొనుఁడనియుఁ జదువకుండినచో నొకసారి పైభాగములఁ జిత్తగింతురుగాకయనియు వినయపూర్వకముగ మనవి చేయుచున్నాఁడను.

శ్రీకృష్ణుని గుచేలుఁడు సందర్శింపఁబోవు కథాంశమున.

" కృష్ణసందర్శనంమహ్యాం కథంస్యా దితిచింతయన్ ... ... ...
నిప్రోగమ్యాంధవృష్ణీనాం గృహేష్వచ్యుతధర్మిణాం
గృహాంద్వ్యష్టసహస్రాణాం మహిషీణాంహరేర్ద్విజః
వివేశైకతమంశ్రీమ ద్బ్రహ్మానందగతో యథా
తంవిలోక్యాచ్యుతో దూరాత్ ప్రియాపర్యంకమాస్థితః॥

సంస్కృత భాగవతము.

అని చెప్పఁబడియున్నది. శ్రీకృష్ణుని యంతఃపురములోనికిఁ గుచేలుఁడు నిరభ్యంతరముగఁ బ్రవేశించుటయేగాక ప్రియాపర్యంకశాయియగు శ్రీకృష్ణుని దర్శించెను. మఱియుఁ గృష్ణానుమతిని రుక్మిణీసత్యభామాదులచే నతిథిపూజలుగూడఁ బడసినటుల నాభాగమునను కలదు. కృష్ణునికులకాంతలకు రాణివాసములేదని విమర్శకు లందురేమో! దీనిని ఖండింప భాగవతమంతయుఁ బ్రమాణము కాఁగలదు. అదియటులుండఁగ పై శ్లోకములోని మహిషీపద మంతఃపుర

కాంతలయెడ వర్తించునదియేయని మనవి చేయుచున్నాఁడ. మామిత్రుల కివి యన్నియు నేల గోచరముకాలేదో విచారణీయము.

కళ్యాణమునకు ముందు రుక్మిణి కాళీపూజకుఁబోవు కథా భాగమునందు సంస్కృతభాగవతములో.

కన్యాచాంతఃపురాత్ ప్రాగాత్ భటైర్గుప్తాంబికాలయం
పద్భ్యాంవినిర్యయాద్రష్టుం భవన్యాఃపాదపల్లవం
యతవాఙ్మాతృభిస్సార్థం సఖీభిఃపరివారితా
గుప్తారాజభటైశ్శూరైః స్సన్నద్ధైరుద్యతాయుధైః॥

ఈకథాంశము స్పష్టముగాఁ దెలియుటకుఁ దెనుఁగుభాగవతము నుండి పోతనగారి పద్యము నిటఁ బొందుపఱచెద.

సీ॥ సన్నద్ధులై బహుశస్త్రసమేతులై
బలిసి చుట్టును వీరభటులుగొలువ
ముందట నుపహారములు గానుకలుఁగొంచు
వర్గంబులై వారవనిత లేగఁ
బుష్పగంధాంబరభూషణకలితలై
పాడుచు భూసురభార్య లలరఁ
బణవమర్దల ముఖపటహవీణాదిక
భేరీనినాదముల్పిక్కటిల్లఁ
ఆ॥ వె॥ దగిలి సఖులుగొలువఁ దల్లులు బాంధవ
సతులు తోడురాఁగ సవినయముగ
నగరు వెడలి నడచె నగజాతకును మ్రొక్క
బాల చికురపిహితఫాల యగుచు॥

దీనికైన మాప్రతిపక్షు లంగీకరింతురో లేక "గుఱ్ఱికి బాతెఁడు హెచ్చో తగ్గో" అనువిధిని వివాహసమయమున రాణివాసము వర్జనీయముగాన వివాహప్రయత్నసమయముగూడ వివాహసమయముగ భావింతురో రుక్మిణికిఁగోషాకలదని వాదింతురో చూడవలసియున్నది.

"మాతృభిస్సార్థం" అనిమూలమునను దెలుఁగునఁ "దల్లులు బాంధవసతులు తోడురాఁగ"యనియు నుండుటచే రుక్మిణితో నాయమతల్లులు వెంటనంటి కాళికాలయమునకుఁ బోయినటుల స్పష్టమగుచున్నది. పోవునపుడు గోషాతోఁబోవకూడదా? యని శ్రీభాశేరావుగారువాకొందురేమో "పద్భ్యాం వినిర్యయా" "నగరువెడలి నడచె" అను వ్యాసోక్తిచే రుక్మిణి రాజమాతలతోఁ గాలినడకతోఁ బోయినటులఁ దెలియుటవలన నాయూహకు సందుండదు. పెండ్లిగాలి పోఁకుచున్నందునఁ బెండ్లికొమార్తెకుఁ బెండ్లికుమార్తెగాలి సోఁకుచున్నందునఁ దన్మాతలకు గోషావర్జనీయమైనదని విమర్శకు లందురేమో ? ఇది పెండ్లికివచ్చువారందఱు నాపెండ్లములన్న విధము. కసిపోక మసిఁబూసికొనినటులఁ గాలినడకతోఁగూడ రుక్మిణి, రాజదారలు గోషా, పాటింపఁగూడదా యని విమర్శకు లనవచ్చును. లేఖని యెంతటి యసత్యమునేని వ్రాయుటకు జంకదుగదా! ప్రధానాంశములే దిక్కులేక గాలిముందు దూదిపింజలవలె నెగిరిపోవుచుండ నీయూహనిలచునా? నిలువదు.

యాంవీక్ష్య తేనృపతయ స్తదదూరవాస
వ్రీడావలోకహృతచేతస ఉజ్ఝితాస్త్రాః
పేతుఃక్షితౌరథగజాశ్వగతా విమూఢాః
యాత్రాచ్ఛలేన హారయేర్పవతీ స్వశోభాం।

భాగవతము దశమస్కంధము.

మ॥ అలినీలాలక పూర్ణచంద్రముఖి నేణాక్షిన్ బ్రవాళాధరన్
కలకంఠిన్ నవపల్లవాంఘ్రియుగళన్ గంధేభకుంభస్తనిన్
బులినశ్రోణి నిభేంద్రయాన నరుణాంభోజాతహస్తన్ మహో
త్పలగంధిన్ మృగరాజమధ్యఁ గని విభ్రాంతాత్ములై రందఱున్॥

పోతనామాత్యుని భాగవతము.

దీనిచే రుక్మిణిని పాటిరాచవారెంఱు చూచి మోహావశులైనట్లును, అష్టస్మారావస్థవహించి దేహధర్మలు తొలంగినటులును, దెలి

యుటచే రుక్మిణి రాజకుమారులముందెట్టి యడ్డులేక సంచరించెనని శ్రీ భాలేరావుగారెఱింగి వ్యాసుఁడు "గోషా" ఆకాలముననున్నటుల సూచించెనో లేదో తెలిసికొనవేఁడుచున్నాఁడను. ఒక రుక్మిణియెగాక యాయమవెంటఁ దన్మాతలు పాదచారిణులై ప్రయాణమొనరించిరను శ్రీవ్యాసునిసూక్తి విమర్శకులమస్తిష్కమునకుఁ బట్టినపిమ్మటఁ దమ వాదమునందలి దౌర్బల్యము తామేగ్రహింపఁగలరు. ఈచరిత్ర-వర్ణణము నాపిమతికొన్ని యాధారముల శ్రీభాలేరావుగారికి నివేదింపఁ బ్రయత్నించితిమి. విషయసిద్ధారణమె ముఖ్యాంశముగాన పురాణముల నించుకసేపువదలి చారిత్రాత్మకములగు పద్యకావ్యముల నొకమారు న్యాయబుద్ధితోఁ బరిశోధింతము. కుమారధూర్జటిచే రచియింపఁబడిన కృష్ణరాయవిజయమను ప్రబంధమున నవివాహితయగు తుక్కారమణీమణి కృష్ణదేవరాయలకుఁ దగినదేమో చూచివచ్చుటకుఁ దిమ్మరసు రాయలవలన ననుజ్ఞనొంది తుక్కారమణితండ్రియగు పాత్రినృపాలునితో నాతిపురి కేగినటులున్నది. ఆపద్యములిట పొందుపఱచుచున్నాఁడ.

"వచ్చెఁ జెలువంబుమీఱ భూవరకుమారి"

తే॥ గీ॥ వచ్చి గారవమలర భూవరునియాజ్ఞ
తనర నప్పాజికపుడు వందనమొనర్ప
నతఁడు దీవించి తగును రాయలకునమ్మ
హాత్మురాలని మదిలోనహర్షమలర॥

తే॥ గీ॥ అమ్మ! కర్ణాటసింహాసనాధ్యుఁడగుచుఁ
జెలఁగు శ్రీకృష్ణరాయల చెట్టవట్టి
మాదృశాశ్రితజనులు నీమహిమనుతులు
సేయవర్ధిలుమనిపల్కెఁ జెలువుమిగుల॥

దీనికి మాప్రతిపక్షు లేమనియెదరో? వృద్ధుఁడని యప్పాజికిఁ గనఁబఱచి యుందురందురా? ఈయూహ పొ[illegible] కృష్ణదేవరాయల

భాల్యము మొదలుకొని యాతనితనయుఁడు సింహాసనాసీనుఁడగువఱకు మంత్రిత్వము నిరంకుశముగ వహించిన తిమ్మరుసు ప్రకృతవివాహకథ నాఁటికె కాలముతీఱిన తాతగారన పేరుండదు. లేక తుఖ్కారమణి తండ్రి రాయలకు భయపడి తిమ్మరసునకుఁ దనతనయను జూపెనందురా? అది చరిత్రమునకు విరుద్ధము. హిందూరాజ్యరమాధురంధరుఁడు, కవితాప్రావీణ్యఫణీశుఁడు, నగు కృష్ణదేవరాయలు తురకలకుఁ బ్రక్కలోఁబల్లెమై "గోషా" ఆచారము విసర్జించి నిరంకుశముగఁ జరించినటుల ద్యోతక మగుచున్నది. ఇతరులకుఁ బూర్వోదాహృతములగు తిరుపతిలోని పట్టమహిషుల విగ్రహములే సాక్ష్యములు. విగ్రహములవిషయమై విమర్శకులు వ్రాసిన యవిచారరమణీయవాక్యములఁ బాఠకమహాశయులకు ముందు విన్నవించెదను. వాల్మీకిమహర్షి 'గోషా" విషయమై యెటులవ్రాసెనో రామాయణము నొకపర్యాయము పరిశీలించుదము.

తదాసుమంత్రంమంత్రజ్ఞా కైకేయీప్రత్యువాచహ
సుమంత్రరాజ జనీంరామహర్ష సముత్సుకః
ప్రజాగరపరిశ్రాంతోనిద్రావశమేయివాన్ ॥

అయోధ్యకాండము.

దీనింబట్టి కైకేయి సుమంత్రునితోఁ మాటలాడినటులఁ బొడకట్టుచున్నది. మఱియు రామునితో సైన్యసంభారములు పంపవలయునని దశరథుఁడు సుమంత్రునితోఁ జెప్పుచుండఁ గైకేయి వలదనుటయు సిద్ధార్థుఁడను వృద్ధమంత్రి కైకేయిని మందలించుటయుఁ గలభాగములు పరిశీలింతము.

తతస్సుమంత్రమైక్ష్వాకుః పీడితోత్రప్రతిజ్ఞయా......
ఏవంబ్రువతికాకుత్స్థే కైకేయ్యాభయమాగతం......
రాజానమేవాభిముఖీ కైకేయీవాక్యమబ్రవీత్
తత్రవృద్ధోమహామాత్ర స్సిద్ధార్థోనామనామతః
శుచిర్బహుమతోరాజ్ఞః కైకేయీమిదమబ్రవీత్......

అని చెప్పఁబడియున్నది. ప్రకృత కైకేయీ దశరథుల సంభాషణసమయమున సుమంత్రుఁడును సిద్ధార్థుఁడను వృద్ధమంత్రియు నున్నటులేకదా! అప్పుడు మనకైకేయి రాణిగారు తెఱచాటున నుండినటుల విమర్శకులు వ్రాయువీలులేనటుల వాల్మీకిమహర్షి దశరథున కభిముఖముగఁ గైక భాషించునటుల వ్రాసియున్నాఁడు. ఇంకను మన ప్రతిపక్షులు రామాయణకాలమునుండి గోషాకలదనుట తగునా? తగదు. సుమ్మాటికిఁ దగదు. నేనింతవఱకుఁ జూపిన యాధారములు ముందుఁ జూపఁబోవు నాధారములు విమర్శకుల రామాయణశ్లోకములోని విసర్జనీయాంశములకుఁ జెందినవికావని జాగరూకతతో గమనింపవలసియున్నది. దశరథునిసమక్షమున సుమంత్రసిద్ధార్థాదులముందుఁ గైక భాషించినటుల స్పష్టముగఁ దెలియుచుండ విమర్శకులవాదమేమి నిలువఁగలదు. ఇఁక భారతముఁ దిలకించుదము.

“వ॥ అనినవిని ధృతరాష్ట్రుం డుదరిపడి విదురునకిట్లనియె.

ఆ. వె॥ బుద్ధిమంతులాలు పొందుగఁ బలుకంగ
నేర్చు వచ్చికొడుకుఁ దీర్చిపోవుఁ
గాన నీవు వేగ గాంధారిఁ దోడితె
మ్మనుచు నరిగి యతఁడు నట్లచేసె॥

వ॥ అద్దేవియు...

కం॥ చనుదెంచి యుచితపీఠం
బుననున్న...............

మహాభారతము ఉద్యోగపర్వము.

ప్రకృతకథాంశము కృష్ణరాయబారము లోనిది. బహుజనవేష్టితమగు నృపాస్థానికి గాంధారి స్వేచ్ఛగ వచ్చి తనయునితో భాషించినటుల భారతమునఁ గలదు. ఈయాధారమ్మును గాంధారి కన్నులకు గంతఁగట్టుకొనునుకాఁబట్టి యాయమ యితరులఁ జూచుట

లేదుగాన నితరులీయమను జూచినను ముప్పులేదు గాన విసర్జనీయ మందు రేమో చూడవలసియున్నది. ఉచితపీఠమన నాపీఠముపై బురకా వేసియుండఁగూడదా ? యందు రేమో ! మా ప్రతిపక్షులకు ఐతమ్మ మొదలగు వారందలములలోఁ బోవురన నందలములకు బురకా వేయఁగూడదా! యనుటయు శిల్పులైతమ్మతో భాషించిరన వాండ్రు కుట్టువాండ్రు కాఁగూడదా”యనుటయు బాగుగా వాడుక. ఆ వాడుక మే మొనరించిన ముండనముపై ధ్వజమెత్తును కాఁబోలు. కానిండు.

ధర్మరాజపట్టాభిషేక మహోత్సవసందర్భమున.

సీ॥ వీర్యవంతములగు వివిధమంత్రంబుల
తోఁగూడ సద్ద్విజస్తోమపరివృ
తునిఁ జేసికొని రాజుఁదోడ్కొనియేగి యా
వినుతపీఠంబున నునిచిశోభ
నాలంకరణమున నభిరామమైన పాం
చాలిఁ దద్వామపార్శ్వమున § సహాస
మాసీనఁగావించి యగ్నిముఖముఁజేసి
కొన్ని హోమతంత్రవర్తనమొనర్చి

అని మహాభారతము శాంతిపర్వమునఁ జెప్పఁబడియున్నది. దీనివలనఁ బట్టాభిషేకసమయమునఁ బాంచాలి యెట్టిగోషాగాని ధరించి నటులఁ గనఁబడదు. పట్టాభిషేకము వారు చెప్పినవిసర్జనీయాంశములకుఁ జేరినది కాదని మేము వ్రాయుట యనవసరము. మేముచూపునాధారములన్నియు మామిత్రులెఱుఁగనివి కావని మాయభిప్రాయము. ఆంధ్రభాషను గవిత్వమువ్రాయుచు బహుగ్రంథపఠనకౌశలురైన భాలేరావుగారు భారతములోని యంశములు పరిశీలించియుండ రనుటకు హేతువులు లేవు. ఎఱిఁగియుండియు నెఱుఁగనటుల గోషా వ్యాపఖండనము వ్రాసినవీరికి నచ్చఁజెప్పుట కష్టతరముగదా! మేలు

---

§ “సహాసుఖాసీనఁగావించి”యని పాఠాంతరము.

కొని నిద్రించుచునటులున్న వారి నేరేని మేల్కొలుపఁగలరా? గుణాగుణములు మాసోదరులైన భాలేరావుగా రెఱుంగుదురు గాన వివిధ గ్రంథాంశములఁ గ్రోడీకరించిచూపినఁ జాలునని మాతలంపు. పైఁజూపిన రెండాధారములు సంస్కృతభారతమునఁగూడఁ గలవు. సర్వజనులకు సులభముగ బోధపడుటకుఁ దెలుఁగుభారతమునుండి యుదాహరించితినని విన్నవించుచున్నాఁడను.

శ్రీరామపట్టాభిషేక సందర్భమున.

రామంరత్నమయేపీఠే సహసీతం న్యవేశయత్
వసిష్ఠో వామదేవశ్చ జాబాలి రథకాశ్యపః
కాత్యాయ స్సుయజ్ఞశ్చ గౌతమో విజయ స్తథా
ఋత్విగ్భిః బ్రాహ్మణైఃపూర్వం కన్యాభి ర్మంత్రిభిస్తథా
యోధైశ్చైవాభ్యషించంస్తే సంప్రహృష్టా స్సనైగమైః॥

వాల్మీకిరామాయణము యుద్ధకాండము.

గోషానిషేధక న్యాసఖండన గ్రంథకర్తృపరావలంబి పద్మనాయకసోదరులారా? వాల్మీకిమహర్షి విరచిత శ్రీమద్రామాయణములోని పైభాగములఁ బఠింపుఁడు. వాల్మీకి వివిధజనపరివేష్టిత కళ్యాణవేదికకుఁ బట్టాభిషేకసమయమున సీతాదేవి గోషా లేకుండఁ బ్రవేశించినట్లు కంఠోక్తిగఁ జెప్పుచున్నాఁడు. ఇట్టి కథాంశమె యింతకుమున్ను భారతమునుండి చూపియున్నారము.

సుభద్ర నర్జునుఁడు వివాహాంతమునఁ దోడ్కొనిపోవుసందర్భమున.

వ॥ ఇట్లు నారాయణుండు నిజారంభంబు సఫలంబగుటకు సంతోషిల్లి సంప్రాప్తమనోరథుండైన పార్థుఁగౌఁగలించుకొని యక్షీణబాణతూణీర బాణాసన సనాథంబయి. పవనజవనహయంబులంబూనిన యకాంచనరథంబెక్కి సుభద్రందోడ్కొని యింద్రప్రస్థపురంబునకరుగుమని పంచి యంతర్ద్వీపంబునకరిగిన.

కం॥ హరిపంచినమార్గంబున
గురునిభుఁడు సుభద్రఁదోడుకొని చనునెడఁ ద
త్పురపరిరక్షకు లతిభీ
కరులు పృథుశ్రవసుఁ డాదిగాఁగలవీరుల్॥

ఉ॥ వీరుఁడువీఁడు పాండవుఁడు వృష్ణికులోద్భవులైన సీరిదై
త్యారులెఱుంగకుండఁగ మహారథుఁడై తరుణీ సుభద్ర నం
భోరుహనేత్రిఁ దోడ్కొనుచుఁ బోయెడి నీతనిఁ బోవనిచ్చినన్
ధీరుఁడు మాధవుండు బలదేవుఁడు నగ్గురు రంచునడ్డమై॥

ఆంధ్రమహాభారతము ఆదిపర్వము.

సుభద్ర కింకను గోషాకలదని వ్రాయఁగల సాహసులుందురా? యుద్ధసమయముగదా విసర్జనీయములోనికి రాఁగల దందు రేమో! యుద్ధ మేస్త్రీ చేయుచుండెనో యాయమకే విసర్జనీయముగాని యుద్ధమొకరుచేయుచుండ మఱియొకరికి విసర్జనీయమని మాపత్రి పక్షులేని వాకొనరు. ఈయమ రథముఁదోలినదిగదా! కనుక యుద్ధము చేసినట్లు లనియెదరేమో! యుద్ధము ప్రారంభింపకపూర్వమే తత్పుర పరిరక్షకులు సుభద్రందోడ్కొని పోవుచున్నాఁడని యాయమను జూడనిదేపల్కుటకు వీలుండదుగదా! ఇంకొకవిశేషముకూడఁ గలదు. అంతకుఁబూర్వముకూడ సుభద్రను బురరక్షకులు చూచియేయుండ వలయును. లేక యిదియే ప్రథమావలోకనమైనయెడల నాయమ సుభద్రయని గుర్తించుట పొసఁగదు. కనుక ద్వాపరాంతమున గోషా యున్నదనువా రుండరని వాకొనవచ్చును.

నలుఁడు దమయంతితో సంభాషించు ఘట్టమున.

"దీనోద్ధతగావున నయ్యాదిగర్భేశ్వరి సమున్నతకనకాసనంబున మున్నున్న యునికినయుండి యనిర్వచనీయంబైన యానందంబు డెందంబున ననుభవించుచు."

శృంగార నైషధము.

అనికలదు గోషాగలకాంతలుసాధారణముగఁ దనయంతిపురికి వచ్చిన పరపురుషుని నేకాంతమునఁ జూచినతోడనే భయపడి మౌన వ్రతమవలంబించి నగరపాలకులకొఱకు గేకలు వేయుట స్వభావ సిద్ధము. అట్టిచో దమయంతి నలునిఁజూచియు గద్దియదిగక.........
"ఉ॥ నానావిధచిత్రవాక్యరచనాచణ భీమతనూజనేర్పునన్ " పలికె నఁట. గోషాస్త్రీలు పరపురుషులతోఁ బ్రసంగించుటకు సాహ సింతురా? అట్టిచో స్త్రీలచిత్తములు మృదులములు, పురుషులు మాయోపాయములతో వశపఱచుకొందురని విమర్శకప్రాయులను మానింపరా? ఇవియన్నియు నిటులుండ నీయమ నలునితోఁ బ్రశ్నించినవిధము నించుక తిలకింపుఁడు.

"సీ॥ ఏదేశమునసనుండి యెచ్చోటికేగెదు
సంకేతమెయ్యది సంజ్ఞనీకు
రక్షాధికృతజనవ్రాతపాలితమైన
శుద్ధాంతమెబ్బంగిఁ జొచ్చితీవు
ఫలమేమియొక్కొ యీపటుసాహసమునకు
మముఁ గృతార్థులఁజేయుక్రమముదక్క
అఖిలకావారికాంధంకరణియైన
శక్తి నీకేవిద్య సంభవించె
తే॥ గీ॥ నైలుఁడవొ మైలబిలు కూర్మియాత్మజుఁడవొ
పంచబాణుఁడవొ దేవపతిసుతుఁడవొ
చంద్రుఁడవొ యింకఁ బెక్కుభాషణము లేల
నిజముఁదప్పక చెప్పుము నిషధపతివొ"॥

శృంగారనైషధము ఆశ్వా ౭

పైపద్యమువలన దమయంతి నలునితో నీరాక యెక్కడనుండి నీవెవ్వఁడవు? రక్షకభటులచేఁ బాలితంబగు * శుద్ధాంత మెట్లుచొచ్చి తివి? అని ప్రశ్నించెఁగాని యంతఃపురస్త్రీలకడ కిటు లేకర మేతెం

* శుద్ధాంతం రాజభవనం, అని శకుంతలావ్యాఖ్య.

చుట తగదనదయ్యెను. ఇట్టి శుద్ధాంత మెట్లువొచ్చితి వనెను గాక యీాళుని తప్పనలేదు. "గోషా" దమయంతికె యున్నఁ బెఱవానితో సోదెవేసికొని కూర్చుండునా? తానెన్నఁడుఁ జూడని నూతనపురుషునిఁ జూచినంతన దమయంతి వ్రీడాసంభ్రమాకులయై యంతర్భవనము లోనికిఁ బోవలసియుండును. ఎవఁడో యనుకొనినంతదనుక స్వేచ్ఛగ గద్దియమీఁదకూర్చుండి లోకాభిరామాయణము ముచ్చటించి యతఁడు నలుఁడని తెలిసికొనిన పిమ్మటఁ దెఱమఱుఁగునకుఁ బోయినది. దీనిం బట్టి యితరుల కంతఃపురకాంత లాతిథ్యమొసంగుటయు సింహాస నాసీనలై ప్రసంగించుటయు మన ప్రతిపక్షులగు భాలేరావుగా రనుకొనిన విధమున దమయంతి గోషాగలకాంత యనుటకు వ్యతిరే కార్థబోధకములుగ నున్నవి. రాజకాంత లానాఁడంతిపురికేతెంచిన పురుషుల కతిథిసత్కారము లొనరించినటుల సంస్కృతాంధ్రనైషధ ములవలన సమముగఁ దెలియుచుండ విద్యావిశారదులగు భాలేరావు గారుశృంగారనైషధములోని పూర్వోత్తర కథాసందర్భములఁ బరి శీలింపక "వివిధరక్షాధికృత పాలితములైన రాజశుద్ధాంతభవన కక్ష్యాం తరం బేప్రకారమునఁ బ్రవేశింతు"నను వాక్యమొందుదాహరించి దమయంతికి గోషాకట్టుట యెంతసాహసమో ప్రత్యేకించి వ్రాయఁ బనియుండదు. నలుఁడు స్వప్నముననేని యంతఃపురప్రవేశము దోష మని కాని, అంతఃపురకాంతలతో నేకాంతసంభాషణ మనుచితమని గాని తలంపక రక్షకభటులచేఁ బాలితంబగు నంతిపురి ప్రవేశించుట యెట్లనియే యోజించుచున్నాఁడు. దీనివలన నానాఁటి యంతఃపుర ప్రవేశమునకు రక్షభటుల నిర్బంధమే ముఖ్యమైనదనియు నంతిపురి చెలువ లాగంతుకుల కాతిథ్యాది సత్కృతులొసంగఁ బ్రాలుమాల రనియు స్పష్టపడుఁగాన, మాఖండనగ్రంథకర్తగారు సెలవిచ్చినటుల "గోషా"కవకాశము లేదని కంఠోక్తిగఁ జెప్పఁగలను. ఈవిషయమై నేను విస్తరించి వ్రాయుటకంటె శృంగారనైషధములోని నాలుగవ యాశ్వాసమందలి నలదౌత్యముఁ జూచికొండని పాఠకులకు విన్న

వించుచున్నాఁడను. ఇంతతోఁ బ్రకృతాంశము శృంగారనైషధము వలన స్థిరపడినటులెగాని పూర్వోత్తర విమర్శమించుక చేయుట యావశ్యకము.

నలుఁడు దమయంతికి దేవతలసందేశము విన్నవించుచు విసుఁగుఁ బుట్టించుచుండెఁగాని తన కులగోత్రాదు లెఱింగింపఁడయ్యె. అత్తఱి దమయంతి విసిఁగి నలుని కులగోత్రాదులెఱుంగఁగోరి,

"తే॥ గీ॥ అనఘ! మమునీవు వంచింప నభిలషించె
దేము నేరమె వంచింప నిపుడునిన్నుఁ
బేరుఁజెప్పుట నీకనాచారమేని
మాకునాయంబె నీతోడ మాటలాడ"॥

క॥ తగవే కులకన్యలకును
మగవారలతోడ రూపమహనీయులతోఁ
మిగులంగఁదడవు లోపలి
నగళులలో మాటలాడ నయతత్త్వనిధీ॥

శృంగారనైషధము. ౪ ఆశ్వా.

అని భాషించెను. దీనిఁజూచి విమర్శకులు దమయంతికి గోషా కలదని పరిహాసపాత్రులు కాకుందురుగాఁత. ఇది దమయంతి యుక్తి సంభాషణము. నలుని నామాదికము లెఱుంగఁబన్నిన కృత్రిమోపాయము. తత్కాల సాత్త్వికావేశజన్య విచారణశూన్య వాక్యము. కావుననే నలుఁ డీప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరమీయ లేదు. దమయంతియుఁ దనకాచరణమునలేని ధర్మము వర్తమాన వ్యవహారమునఁ జొప్పించుట యెదటివానిగుట్టు తెలిసికొనుటకె. లోనినగళులలోపల రూపమహనీయులగు మగవారలతో భాషించుటదోషమైన దమయంతి దూతవేషధారియగు నలునకాతిథ్యమొసఁగునా? అంతఃపుర ప్రవేశమున కంగీకరించునా? ఇవి సామాన్య నిబంధనా ప్రస్తుత ప్రశంసాలంకారవాక్యములని వ్యాఖ్యాతలుసెలవిచ్చియున్నారు. కానఁ

బై యంశము విమర్శకుల కాధారము కాఁజాలదు. మఱియు నలుఁడు దమయంతితో నీవుదిక్పాలురవరియింపక తప్పదు. నీవీయకొనకున్నఁ గల్పవృక్షసాహాయ్యమున నిందుఁడో ? కామధేనుసాహాయ్యమున వరుణుఁడో ? యగస్త్యునివలన యముఁడో? నిన్నుఁ బడయక పోరన నలునియందు బద్ధానురాగయగు దమయంతి విలపింపసాగెను. అత్తఱి నలుఁ డాయమ శోక హేతు వెఱింగియు.

"వ॥ చెలువ ? చెక్కుటద్దములఁ జేయిడి యేలచింతిం చెదవు......... ఏ కారణంబున నశ్రులురుల నేడ్చెదవు ?......(నేను) తప్పనాడంగదా ? యాత్మనిహ్నవం బపరాధంబొక్కో? శుద్ధాంతప్రవేశంబు దోషంబొ? దేవదూత్యంబుపరిత్యవాయంబొ ? చెప్పుము.

అని ప్రశ్నించెను. ప్రశ్నాలంకారము అప్రస్తుతప్రశంస. కావుననే నలుఁడు దమయంతి సంతాపహేతువెఱుంగుటయే కాక పైపెచ్చుసంతాపకారి తానె యయ్యు నేలయేడ్తువనియు దేవదూత్యము దోషమా యనియునాత్మనిహ్నవం బపరాధంబా ! యనియుఁ దాను తప్పనాడలేదుగదా యనియు సత్యేతరవాక్యములకుం దిగినాఁడు. పై వాక్యములన్నియు నప్రస్తుతప్రశంసాలంకారవశమున నెట్లు సత్య దూరములో శుద్ధాంతప్రవేశంబు దోషంబొ యనుటయు మిథ్యా వాక్యము. ఇది తెలుఁగులో శ్లోకశుద్ధియైన ప్రతివాఁ డెఱింగిన విషయమే. దీనిచే నలునిమతమున శుద్ధాంతప్రవేశము దోషంబు కాదని వ్యంగ్యార్థము స్ఫురించుచున్నది. దీనిని దమయంతి యాచర ణము నలునిశుద్ధాంతప్రవేశము బలపఱచుచున్నవి. నైషధమునందలి యంశము లిటులుండ దమయంతికి విమర్శకులు గోషాబురకావే యుట యెంతపొరపాటో నేను వ్రాయఁజాలను. క్రీ॥శ॥ 12 వ శతా బ్దముననున్న భట్టహర్ష మహాకవి యానాఁటి కన్యాకుబ్జరాజాన్వ యాచారములు పూర్వరాజాచారములు సమన్వయించి దమయంతి కొసంగిన స్వాతంత్ర్యపారతంత్ర్యములు పరిశీలింపక పద్మనాయక కాంతలతోఁబాటు దమయంతికి గోషాకట్టుటకుఁ బూరోఁ తర

సందర్భములు తెలుపక నైషధమునుండి యొకచిన్నవాక్య మసం పూర్ణముగ నుదాహరించి మాకు కారణముగ భ్రమంగల్గించిరి. నైషధము వలన నాయికయగు దమయంతి స్వాతంత్ర్యవతియని విస్పష్టముగఁ దెలియుచున్నది. శృంగారనైషధమంతయుఁ జూడ సావకాశము లేని పాఠకులు దమయంతిచారిత్రము నెఱుంగుటకుఁ జతుర్థాశ్వాస మొక్కటి సాకల్యముగఁ జూచిన వివాదాంశము బోధపడఁగలదు.

ధ్రువోపాఖ్యాన కథాభాగమున ధ్రువుఁడు మాఱుతల్లిచే నగౌరవము నొందినపిమ్మట సునీతి.

నిశమ్య తత్పౌరముఖా న్నితాంతంసాపి వ్యథేయద్గదితం సపత్న్యా।

భాగవతము.

పైశ్లోకమువలన మనకుఁ దెలియునంశము పౌరులవలన సునీతి యను రాజదార తనపుత్త్రునియవస్థ వినినదని. దీనిచే సునీతికి గోషా కలదని యెవరేని వాదింపఁగలరా? ఆమెకు గోషాయున్న తనపుత్త్రుని వర్తమానము పరిచారికలవలననో వృద్ధకంచుకులవలననో మఱియెవరి వలననో వినినటుల వ్యాసమహర్షి వ్రాసియేయుండును. ఇట్టికథలు తిలకింపక తొందరపడి మావ్యతిరేకవాదులు భాగవతము తామాధార ముగఁ దీసికొనుట హాస్యాస్పదము. తనభార్యకుఁ గాళిదాసునకుఁ బరస్పరసంబంధము కలదని భోజనృపాలుఁడు భ్రాంతిపడినపుడు.

"రాజా.........పశ్యేద్యుః కాళిదాసం దాసీముఖే నానాయ్య తదాగమనానంతరం తస్యైవ లీలాదేవీంచానాయ్య దేవీంప్రత్యవదత్ .........కాళిదాసో దేవ్యాంసమీపవర్తిన్యామపి ఉత్తరార్థం ప్రాహ"

భోజచరిత్రము. 26 వ పుట.

అనికలదు. దీనిచేఁ గాళిదాసుఁడు భోజునిభార్యయగు లీలా దేవితో మాటలాడినట్లు దాసికిన్నృపాలుఁడభ్యంతరముఁగావింపనట్లు తెలియుచున్నది. విమర్శకులు దీని కేమందురో? మొండియెద్దైనను నాకెద్దే గెలువవలయుననినట్లు సారవిహీనమైనను అయుథార్థమైనను

నిరాధారమైనను నావిమర్శమే గెలువవలయునని పోరాడుదురేమో? ఇట్లుకాకున్న వారివిమర్శము వాఙ్మయమున నిలుచుట్రోవలే లేవు కదా! రామాయణములోని విసర్జనీయవములకు సొంతముగాఁగొన్ని జతపఱచినచో వీరికి జయమగునేమో? అటులుచేయరైరి.

నందుఁడనురాజు అతిథియగు బ్రాహ్మణుని గౌరవించుసందర్భమున ముద్రారాక్షసమున.

"కల్యాదౌ నందనామానః కేచిదాసన్ మహీభుజః
రాజపత్నీ సునందాసీ జ్యేష్ఠాన్యా వృషలాత్మజా
మురాఖ్యాసా ప్రియతమా శీలలావణ్యసంపదా
సకదాచి త్తపోనిష్ఠ మతిథిం గృహమాగతం
అర్ఘ్యపాద్యాదిభిర్భక్త్యా సభార్యాసమపూజయత్"॥

అని వ్రాయఁబడియున్నది. ఇంటికేతెంచిన యభ్యాగత బ్రాహ్మణునకు భక్తిశ్రద్ధలతో భార్యలతోఁగూడి నందుఁడను భూపాలుఁడాతిథ్యమొసంగెనని యిందలిభావము. ఈయాధారమును మావిమర్శకు లెటుల విమర్శింతురో కనుంగొనవలసియున్నది. ఆకాలమున గోషాఆచారమె యున్న నందరాజు తనయంతఃపురకాంతల బ్రాహ్మణునిసన్నిధి కేలరప్పించును? దీనిచేఁ జరిత్రములలోఁ బేరుకెక్కిన నందునికాలముననే గోషా స్వవిషయమున నుపయోగింపఁబడనటుల ధ్రువమగుచున్నది. తెలిచినకొలఁది యిసుకపాతరవలెఁ బ్రకృతవిషయమున కెన్నియో బలవత్తరములగు నాధారములసంఖ్యాకములు లభించుచుండ నాౘ్రాతనిరాధారమనుటకు భావిరావుగారేల శంకపడరో!"శంకామేకాంపరిత్యజ్య త్రిలోకీవిజయీ భవేత్" శంకవిడచిన మూఁడులోకములు జయింపవచ్చునను మహామంత్ర ముపాసించి బహుశః నన్నుజయింప బయలుదేరియుందురు.

చంద్రగుప్తచక్రవర్తి యుద్ధమునకు బయలుదేరువిధము.

"సేనాముఖంబుననాయకులును నడుమరాజును అంతఃపురస్త్రీలును

కుడియెడమవైపుల నాశ్వికసైన్యమును చుట్టు నేనుంగులును దక్షుంగల సైన్యమునడచును."

స్వామివిద్యానందపరమహంస. బియేగారి చంద్రగుప్త చక్రవర్తి 96 పుట.

దీనిచే భర్తలతో నంతఃపురకాంతలు యుద్ధములకు బయలు వెడలినట్టులఁ గానవచ్చుచున్నది. "గోషాతో బయలుదేరియుండఁ గూడదా?"యని భాలేరావుగారు శంకచేయుదురేమో! నందుని కాలములో నీయాచారమ్ము లేనటులఁ బైన స్థిరపఱచితిఁగావున నిట నంతఃపురకాంతల కెట్టిగోషానిర్బంధ ముండియుండదు. చరిత్రకారుఁడును గోషాతోఁ బ్రయాణమైనటులఁ జెప్పియుండఁడు. అంతఃపుర కాంతలకు గోషాయున్నటు లొప్పుకొన్నయెడల రాజును వారివెంట నున్నటులఁ జెప్పఁబడుటచే నాయనకుఁగూడ బురకా వేయవలసి వచ్చును. కావునఁ జంద్రగుప్తునిశుద్ధాంతకాంతలు యుద్ధయాత్రలలో (యుద్ధములలోఁగాదు) భర్తతోసమముగ సేనామధ్యమునఁ దిర్గుచుండిరని తెలియుచున్నది. దీనిని బ్రతిపక్షులెటుల సమర్థింతురో! యెంత పరిహాసపాత్రులగుదురో! మఱియు.

"జయంతభూకాంతుఁడు మంత్రివరులతోడను అంతఃపుర కాంతలతోడను గమలాన ర్తకీగృహమున కేగి యందు విడిసియున్న జయాపీడుని మహావైభవముతో నింటికిఁ దీసికొనిపోయి......కళ్యాణ దేవినిచ్చి వివాహముఁ గావించెను.

(కల్హణకృత) రాజతరంగిణి చతుర్థతరంగము. 91 పుట.

దేశీయచరిత్రకారులలో నుత్కృష్టుఁడగు కల్హణుని చరిత్రాంశముల శిరసావహింపని విజ్ఞులుండరు. జయాపీడునకు స్వాగత మొసంగుటకు జయంతభూపాలునితో మంత్రివర్యులతో నంతఃపుర కాంత లెట్టినిర్బంధము లేక వెడలి మహావైభవముతో నాతని తోడి తెచ్చిరఁట. పరులగృహమున కేగుటకుఁ బరులకు స్వాగత మొసంగుటకుఁ

బరులగునమాత్యాదులతోఁ బ్రయాణములు సల్పుటకుఁ బరులఁదోడ్కొని యతివైభవముగ నిల్లుచేరుటకుఁ బూర్వకాలశుద్ధాంతకాంతలు జంకరని కల్హణకవి తనయథార్థచరిత్రమున నిస్సందేహముగ వ్రాసిన యీయంశములు విమర్శకులకుఁ బఠనీయములు. వారిపూర్వాలోచనములు విసర్జనీయములు. దీనిచేఁ గల్హణమహాకవి వ్రాతచొప్పునఁ గ్రీ॥శ. 1000 ప్రాంతములనుండి క్షత్రియకాంతలకు రాణివాసము సైతము ముఖ్యముకాదనితోఁచుచున్నది.

సుభద్ర రైవతకోత్సవమునకు వచ్చుసందర్భమున.

ఉ॥ యావతచూలికాభరణ మత్తతఁ గొందఱుబోంట్లు ముంగలన్
రైవతకోత్సవాగతజనంబు బరాబరిసేయుచుండఁ ద
ద్దేవత కర్చనానతు లతిప్రమదంబునఁ జేసెఁ బైపయిన్
దైవతరాజనందనధనంజయునిన్ బతిగాఁ దలంచుచున్॥
(బరాబరి = కడకుఁదోయుట వే॥ వేం॥ శా)

కం॥ నగధరుని వెంటనడచిరి
మిగులన్ గయిసేసి యటఁదమిన్ గస్తూరీ
భుగభుగలు నుదిరిబంగరు
సిగసిగ నెలయం దెఱవలు నెఱయన్ దెఱవల్॥

చం॥ పురజను లింపునన్ గనఁగఁ బొంతల రుక్మిణిసత్యభామయున్
దొరయఁగఁ దక్కునాఱ్వురునుదోఁజన నావెనుకన్ బదాఱువేల్
తరుణులు నొల్చిరాఁగఁ బ్రమదంబునఁ గృష్ణుఁడువట్టివేళ్లచ
ప్పరములనీడనే యరిగెఁ బట్టినకానుకలెల్లఁజూచుచున్॥

విజయవిలాసము. 121-122 పుటలు.

* పలువురుచూచుచుండ సుభద్ర రైవతకోత్సవమునకుఁ బోయినటుల మొదటిపద్యమువలనఁ దెలియుచున్నది. ఇట సుభద్ర కన్నులు తెఱువనికందు కాదు. ప్రాయము రాని పడఁతిగాదు. మఱియొవ్వతె యనిన యావతచూలికాభరణము. (యువతీవతంసము) జవ్వనులలోఁ

దలఁచునానికము. కాన సుభద్ర గోషాగలకుటుంబినిదైన బురకా వేసికో వలసినదే. అదియటుండఁ గృష్ణునియవరోధకాంతలందఱు రైవతకోత్సవమునకుఁ "బురజనులింపుగనఁగఁ బొంతలనేగి"రఁట. ఇట కవి వ్యతిరేకార్థమున కవకాశము లేకుండఁ బ్రకృతాంశము స్పష్టముగఁ జెప్పినాఁడు. దీనికి మామిత్రులేమి చెప్పికొందురో? కృష్ణగేహినులకు శుద్ధాంతావాసము లేదని పరిహాసము చేయకుందురుగాఁత. ఇందులకు సాహసింతురేని విష్ణుపురాణము భాగవతము వారుపఠింపవలసియుండును. దుఃఖసమయములో నంతఃపురావాస మెట్టులవిసర్జనీయమో సంతోషసమయములలోసైత మటులేయని యందురేమో! వారిమ్రాఁత వారియనుగ్రహాధీనముగదా. అదియుఁగాక వారిపూర్వజనులు వారినిఁజూచినఁ బట్టింపులేదని వాదింతురేమో! అటులైన సంతసమే. ఎవరియూరి వారికి వారు కనిపించుచుండుటయు ఘోషాఆచారము గాదుగాన నాయూహయు నిలువదు. చేమకూర వేంకటపతికవి పదునాఱవశతాబ్దములోనివాఁడు గాన నీవిషయము నవీనమని త్రోసివేయుదురేమో! ఇంతకంటెఁ బొరపాటు వేఱుండదు. ఏలయన వేంకటపతి రఘునాథభూపాలుని యాస్థానములోనివాఁడు. రఘునాథనృపుఁడు స్వయముగఁ గవి రసికుఁడు. అప్పటియాచారములకు రైవతకోత్సవకథనము వ్యతిరేకముగనున్న నానృపుఁడే యాటంకపఱచియుండును నాఁటనుండి నేఁటివఱకు నవ్యాహతముగ వ్యాప్తివహించిన ప్రకృతాంశము గణనీయమే. దక్షిణదేశములలో గోషాఆచారము లేదనియు నాప్రాంతములఁ దురకలవారు లంత యపరిమితముగా లేమి నిట్టిదురాచారము లాసంస్థానములలోఁ బ్రబలలేదనియు నీకథాభాగముచే నూహింపవచ్చును. దీనికిఁ బ్రతిపక్షు లేకీభవింపకపోరు.

వేదకాలమునాఁటి యాచారముల ముచ్చటించుసందర్భమున కె. వి. లక్ష్మణరావుపంతులుగారు హిందూమహాయుగమున.

"పురుషులవలె స్త్రీలును బ్రహ్మవిద్యనుగూడ సంపాదించి రాణివాసము లేక రాజసభలలోనికివచ్చి విద్వాంసులతో శాస్త్రార్థము

ముచ్చటించుచుండిరి. ఇందులకు జనకునిసభయందు యాజ్ఞవల్క్యుని కిని గార్గి వాచక్నవికిని జరిగినసంవాదమే దృష్టాంతము. ఈ సంవాదము బృహదారణ్యకములో వివరముగా వర్ణింపఁబడి యున్నది. అప్పటిస్త్రీ లగ్నిహోత్రాదికములు స్వతంత్రముగాఁ జేయుచున్నట్లును సంధ్యావందనముఁ జేయుచున్నట్లును రామాయణములో వ్రాయఁబడి యున్నది. గొడుగును జెప్పులను ఒకానొకస్త్రీనిమిత్తమై మొదట చేయఁబడినట్లు మహాభారతమున వ్రాయఁబడియుండుటచే నప్పటి స్త్రీ లెండవానలవలన స్వదేహము రక్షించుకొనునిమిత్తము పాదరక్షలను ఛత్రములను ఉపయోగపఱచుచుండిరని కానవచ్చుచున్నది.

అని వ్రాసిరి. ఇది క్రీస్తుశకమున కెంతయోపూర్వఁపుఁజరిత్రాంశము. అనఁగా నాలుగువేలసంవత్సరములనాఁటికథ. అప్పుడు స్త్రీలు రాణివాసములేక రాజసభలకేతెంచి శాస్త్రవాదములు సలిపిరఁట. ఇది యాకాలపు గోషాసరణి. అదియు జనకునికాలమున. జనకుఁడు రామాయణకాలములోనివాఁడు. ఆకాలమున రాణివాసమే స్త్రీలకు లేదని శ్రీరావుగారు సెలవిచ్చుచుండ గోషాకలదనుట యెంతసవ్యమో నేనువాకొన నవసరములేదు. ఈయాధారమును విమర్శకు లొప్పికొని తీఱవలయును. ఏలయన నీచరిత్రకారుని విమర్శకులు ప్రమాణముగ స్వీకరింపుటవలన. విద్వద్గోష్ఠియందు గోషా యనవసరమని విమర్శకులనినప్పుడు దీనిని విస్తరింతును.

“మహేంద్రుండను తనకుమారుని సంఘమిత్రయను తన కూఁతును నశోకుఁడు సింహళమునకు ధర్మోపదేశార్థము పంపెను. వారచ్చటనాటిన ధర్మబీజమే నేఁటికిని అచ్చటఁ బ్రబలియున్నది”.

హిందూమహాయుగము. పు 134.

అని కె. వి. లక్ష్మణరావుపంతులువారు వ్రాసియున్నారు. ఈదృష్టాంతరమునకుఁ బ్రతిపక్షులు వాకొను విమర్శాభిప్రాయ మెద్దియో ! ధర్మోపదేశార్థముగాన గోషాతోఁ బనిలేదనియో ! లేక

రయొక్క తూటి కంత తప్పులేదందురా ? లేక "కామినులింట" అను పద్యమునువలె జాఱవిడతురా ? ఏమో వారిచిత్తము. మాభాలే రావుగారి వ్రాఁతకు సత్యాసత్యములు యుక్తాయుక్తము లనవసరము గదా ! దేశమున ధర్మబీజమునాటి ఖండాంతరులచేత సైతము వేనోళ్ళఁ బ్రశంసింపఁబడిన యశోకచక్రవర్తికాలమునను ఆయన యాచరణమందును లేని గోషాకై మనమేల పెనఁగులాడవలయును ? తురుష్కులవలన వచ్చిన నీగోషాదురాచారమును వారిపాలనతోఁ బాటుగ నంతమొందింపక పోవుటకు సిగ్గుపడక గోషా ఆచారము హిందువులదనుట భావ్యముగాదు. ఒకవేళ హిందువులలో నీయాచార మున్న నేప్రాచీనగ్రంథముననేని కానరాదా ? భాలేరావుగారు విమర్శకులుగాఁదలంచి హిందువులకు మొదటినుండి గోషాకలదను నపయశము గల్గించుటకుఁ బ్రతిభారతీయుఁ డేవగింపక మానఁడు.

అట్లు "పురాణకాలములోని యువతీమతల్లులు చరిత్రకాలము లోని మానినీమతల్లులు ప్రభువంశసంభూతలు తొల్లింటికాలమున గోషాలేక ప్రవర్తించిరని తెలిసికొని వేదమునను భారతభాగవత రామాయణాది పురాణేతిహాసములలోను బృహత్కథామంజరి కథా సరిత్సాగరము లోనగు నపౌరుషేయగ్రంథములలోను మనపూర్వులు గోషాజరిపినట్లు కన్పట్టదని" నేను వ్రాసియుండ నాధారము లెచ్చటఁ జూపనందున నాయాశయము గగనకుసుమమైనదని భాలేరావుగారు వక్కాణించిరి. ఇపుడాధారములు పూర్వోదాహృతగ్రంథములనుండియు గణనీయములగు నితరగ్రంథములనుండియుఁ జూపితినిగాన నాయాశ యము అపూర్వాచారతిమిరలోకవర్తనులకు గగనమణియైనదని యొప్పుకొనకతప్పదు ఇంతతో విమర్శకులు తృప్తివహింపకున్నఁ గేవల మాధారములఁ బోవుచేసి రామాయణమంతగ్రంథము చూపఁ గలను. ఈసందర్భమున నేనాధారములఁ జూపనిమాత్రమున గ్రంథ నామము లుదాహరించినమాత్రమున నావ్రాఁత యెట్లుగగనకుసుమ మయ్యెనో విమర్శకులు సెలవీయఁ బ్రార్థితులు.

నేను నాగోష్ఠీవ్యాసము మొదటిపుటలో "నిండుపేరోలగంబున సింహాసనాసీనులైన పతులకుఁ జేదోడువాదోడుగఁ జరించినట్లును బరపురుషులనిరైనను గొంకక మహానుభావులు హఠాత్తుగఁ దమకగుపడినప్పుడు అతిథిసత్కారము లొసంగి చక్కఁగ వారితో భాషించినట్లును దాము వనవాసాజ్ఞాతవాసంబులకేగ నియమము లేకున్నను భర్తలతోఁ గూడఁ గాలి నడకతో దుర్గమారణ్యభూములఁ జరించి కడు నిడుములందినట్లును, నానాదేశ భూపాలమణులు కొలువుకూట మలంకరించియుండఁగఁ దమకిష్టమైన పురుషుల వరించినట్లును ప్రాణేశ్వరులు సంగ్రామరంగంబున కేగునప్పుడు వెంటనంటి రథచోదకకృత్యములు నెఱపుటమాత్రముననెగాక సమయమేతెంచ బాలు కేలఁగీలించి ... ... వైరులఁ జెండాడి, పతులకు జయంబుఁగూర్చినట్లును సీత దమయంతి ద్రౌపది ...... మొదలగు పతివ్రతామతల్లుల చరిత్రము మనమనేకపర్యాయములు చదివియున్నార" మని వ్రాసియుండ విమర్శకులు పైయంశములన్నింటిని జాఱవిడచి వానిలోఁ బూర్వఁపుస్త్రీలు నిండుపేరోలగంబున సింహాసనాసీనలై పతులకుఁ దోడ్పడిరనునంశము, బహురాజాలంకృత సభాస్థలమున స్వయముగఁ బురుషులవరించిరనునంశము, మాత్రము విమర్శింపసమకట్టి, రామాయణశ్లోకమువలన నీరెండంశములును విసర్జనీయములలోఁ జేరినవని తమయభిప్రాయముఁ దెల్పిరి. ఆశ్లోకము నిచ్చట నుదాహరించుచున్నాఁడను.

† శ్లో॥ వ్యసనేషు నకృచ్ఛ్రేషు । నయుద్ధేషు స్వయంవరే
నక్రతౌ నవివాహేచ । దర్శనందుష్యతి స్త్రియాః॥

(వ్యసనమునందును, గష్టమునందును, యుద్ధమందును స్వయం

---

† పై శ్లోకార్థము బోధించు నాంధ్రవాల్మీకిరామాయణమందలి పద్యము.
కం॥ సమరంబుల వ్యసనములన్ । దమరముల స్వయంవరంబునన్ బెండ్లియెడన్ ।
ఘుమతీయజ్ఞములందున్ । కమలాక్షులదర్శనం బకార్యంబగునే॥

వరమందును, యజ్ఞమందును, పెండ్లియందును, స్త్రీలదర్శనము దూష్యముకాదని తాత్పర్యము)

ఈశ్లోకములోని విసర్జనీయాంశములలో స్వయంవరాంశము చేరినదిగాని భర్తలకుఁ జేదోడుగ స్త్రీలు రాజ్యమేలవచ్చునను నంశము చేరలేదు. శ్రీభాలేరావుగారు నావ్యాసమునుండి రెండంశములు మాత్రమె స్వీకరించి వానిని రెంటిని రామాయణశ్లోకములో నన్వయింపఁజూచిరి. శ్లోకమును జక్కఁగ నర్థముఁజేసికొనినయెడ భాలేరావుగారు విసర్జనీయాంశములతో స్త్రీలస్వతంత్రరాజ్యపాలనముఁ గూడ నంగీకరింపకపోరు. ఎటులైననేమి! పరిశిష్టన్యాయానుసారముగ యువతులు భర్తలచేదోడుగ రాజ్యమేలవచ్చునని యంగీకరించిరి. శ్లోకములో నున్ననేమి! లేకున్ననేమి! శ్రీభాలేరావుగారి వాక్యములే కదా మనకిపుడు ధర్మశాస్త్రములు. పూర్వకాలమున గోషాలేకయున్న యువతీమతల్లుల యథార్థచారిత్రములు నేనుపెక్కింటిని సూచించియుండ నందురెంటిని విమర్శింపసమకట్టి మిగిలినవానిని జాఱవిడచి విమర్శింపఁబూనిన రెండంశములలో నొక్కదానినిమాత్రము తమ యుదాహరణమున కనుగుణమొనరించికొని మఱియొకదానిజోక్యము విడచుటయేకాఁబోలు విమర్శకుల నిష్పక్షపాతవిమర్శమునకుఁ బ్రథానాధారము. ఆహా! విమర్శకుని సత్యశీలత.

వీరు రామాయణమునుండి స్వీకరించిన పైశ్లోక భాగములు చక్కఁగఁ బఠించిరనుటకుఁ గాసంతయేని వీలుగలుగుటలేదు. శ్రీరాముఁడు పట్టాభిషేకమున సర్వజనసమక్షమున సీతతోఁ బీఠముపై నాసీనుఁడయ్యెను. ఇది పైశ్లోకములోఁ జేరలేదు. దీనిగతి యేమి కావలెను. కైక పలుమాఱుసభాస్థానమున వృద్ధమంత్రితో సుమంత్రునితో భాషించినది. దీనిగతి యేమికావలయును. దీని సమన్వయమెట్లని శ్రీభాలేరావుగారు విమర్శము సలుపక రామాయణమున హఠాత్తుగ లభించినశ్లోకముతో నన్నుజయింపవలయునను మురిపెముతో సారకోతలకుఁ గడంగిరి.

సైషా యుద్ధగతా చైవ। కృచ్ఛ్రేణ మహతి స్థితా
దర్శనేస్యా న్నదోషస్స్యా। న్మత్సమీపే విశేషతః।

వాల్మీకి రామాయణము యుద్ధకాండము.

ఈశ్లోకమును విమర్శకులు జాఱవిడచిరి. కారణము విజ్ఞుల కూహ్యము. పైశ్లోకమువలన "ఈసీతరణస్థలమున వసించి మిక్కుల శ్రమనందెను. ఈమెదర్శనము దూష్యముకాదు.. నాచెంతనుంటచే మఱియును దూష్యముకాదు" అనునర్థము తెలియుచున్నది ఇది రామునివాక్యము. ఈశ్లోకము మనస్సుననుంచికొనియే నేను గోషా వ్యాసము వ్రాసితిని. నావ్యాసమంతయు నీ శ్లోకమునకుఁ జెంది యున్నది. కాననే రావుగారీశ్లోకము నుదాహరింపరైరి. నేనును భర్తృ సవిధమున సతులకు గోషావలదని చెప్పుచున్నాఁడను. రాముని యభిప్రాయమిది కాకున్నఁ బట్టాభిషేకమున భార్యను జెంతనుంచికొని స్వవచోవ్యాఘాతముపాలగునా? నేను గోషావిసర్జనీయమని వాదించి నదిగూడ నింతవఱకె. కాని భాలేరావుగారు సెలవిచ్చినట్లు "పద్మ నాయక స్త్రీసముదాయమును బజారున క్రీడింప నప్పుడు నిప్పుడుఁ దలంపలేదు. ఈభాగమున రావుగారిలేఖిని హద్దుమీఱినది. మా వ్యతిరేకవాదిగా రుదాహరించిన విసర్జనీయాంశముల శ్లోకముతో భర్తృ సాన్నిధ్యవాసినులయంశముఁ జేర్చితిలకించినచో నాకాలమున రాణి వాసమేకలదో గోషాయేకలదో చదువరు లెఱుంగకపోరు. శ్రీరాముఁడు సెలవొసంగినయంశములకుఁ బాఠకులంగీకరించినచో గోషావిసర్జనీయ మనియు రాణివాసము స్వేచ్ఛాభూయిష్ఠమైనదనియు దాని నియమము లించుకయేని దుర్ఘటములు కావనియు సాహసించి వాకొనఁగలను. పూర్వము ప్రభువులకులకాంతలకు రాణివాసము కలదు. దానినే శుద్ధాంతవాసమనియుఁ బూర్వకవులు వ్యవహరించిరి. అంతఃపురమన లోపలియిల్లు. అవరోధమనఁ బగులను భటులు నిరోధించుస్థలము. శుద్ధాంతమన శుద్ధమనస్కులచేఁ గాపాడఁబడుస్థలము. గోషాయన మూలయని యర్థము గాన నుభయపదములు సమార్థద్యోతక

ములు కాఁజాలవు. ఆచరణములలో నెంత యనరాని మార్పు కలదు. ఆధునికపండితకవులు గోషాను రాణివాసమును వేర్వేరుగా భావించినటు లుదాహరణములు మున్నె యుదాహరించియుంటిని. ఎంత క్లుప్తీకరించి యీయంశము వ్రాయఁదలంచినను నాతలంపు నెఱవేరుటలేదు. పూర్వము క్షత్రియకాంతలకు రాణివాసముకలదు. ఆరాణివాసపుఁజోటున కితరులు సెలవులేనిది ప్రవేశింపవీలుండదు. ఎందువలనన ద్వారికులనిర్బంధముచేత. అట్టినిర్బంధము తొలఁగించికొని నలుఁడు రాణివాసమున దమయంతితో స్వేచ్ఛగా సంభాషించినాఁడు. వెయ్యేల రాణివాసఁపుస్త్రీలు తమకవసరమైనప్పుడు శ్రీరాముఁడు సెలవిచ్చిన నియమములలోఁ గాక పలుమాఱు పురుషులకగుపడి మహత్కార్యము లొనరించినటుల నేను పెక్కులాధారములు చూపియున్నాఁడను. ఆయాధారములన్నియు క్షత్రియస్త్రీలకు సంబంధించినవే కాన వ్యతిరేకవాదు లిఁకనైనఁ దృప్తివహింతురుగాఁక. అప్పటి రాణివాసఁపు గరితలు పరపురుషులకుఁ గాన్పించుచుండిరనియుఁ రాణివాసఁపుస్త్రీల స్వేచ్ఛాప్రచారమునకు రాముఁడు కొన్నివర్జనీయాంశములు నిర్వచించెననియు నవి రామునికాలమునను బురాణకాలమునను ఆచరింపఁబడలేదనియు మనమిత్రు లంగీకరింపవలసినదే గదా! ఇఁక గోషానియమముల బరికింతము. గోషాస్త్రీలు మరణించినప్పుడు వారిస్థూలదేహమునకుఁగూడ నాయాచారము విధించి శవమున బల్లకినుంచి పైముసుఁగు వైచి కొనిపోవుచున్నారు. పెండ్లికూఁతుండ్రిన సూత్రధారణసమయమునఁగూడ పరజాలచాఁటున నుంచి వధూవరులకుఁ బరస్పరావలోకనములకై నిర్బంధముఁ గల్పించి ముసుంగు నేస మయమున నేసి తీయుకయ వివాహములు గోషానియమముఁగలవారు చేయుదురని నేను వ్రాయఁబనిలేదు. ఇది లోకమెఱింగినయంశమె. పెండ్లికుమారితె ముసుంగులోనుండుఁగాన సూత్రధారణ మాపరజ చాఁటుననున్న యేపరిచారిక కొనరించినను దిక్కుండదు. ఇతర హిందూకుటుంబినుల కున్నటుల వివాహమున దంపతులకుఁ బరస్ప

కావలోకనభాగ్యము లేనేలేదు. శ్రీరాముఁ డానయిచ్చిన నియమము లలో వివాహమునకు దర్శనము దూష్యముకాదుకదా! మనమాచరించు "గోషా" యేరాణివాసమైన వివాహమునకట్టి నిర్బంధము లేల! "నవివాహే" యనిరాముఁడనిన సూక్తిరాజము మఱచి తురుష్కులవలె వధూవరులకుఁగూడ దర్శనావకాశములు కలుగకుండఁ బ్రవర్తించుచు వివాహమందు స్త్రీల బురకాలలోనుంచుచు రాణివాసము గోషా యొకటియె యనిన లోకము సమ్మతించునా? ఏం విమర్శకులుగారూ! గోషాస్త్రీలను మనమెన్నిమాఱులు శ్రీరాముఁ డాజ్ఞ యిచ్చిన విసర్జనీయాంశములలో బయటికిఁ దెచ్చుచున్నారమో వేళ్లు మడచి సెలవిండు. పుట్టినది మొదలు గిట్టువఱకు కాఁదువాండ్రను ప్రపంచ శత్రువులుగ భావించి సృష్టికిఁజెందిన జంతువులనియైన తలంపక వారలమనస్సులు మృదులములు పురుషులు సులభముగ వశముఁగావించుకొందురను వెఱ్ఱిభ్రాంతికిలోనై గోషాయను కారాగృహమునఁ ద్రోచి స్త్రీవిద్రోహము సలుపఁ బాటువడుటయేకాక గోషా రాణివాస మొకటియనుట యెంతసాహసము. ఎంతసత్యదూరము. అంతఃపురాంగనలకు రామాయణమునఁ బెక్కుస్వాతంత్ర్యములు చెప్పఁబడియున్నవి. వారటులె సంచరించిరి. గోషాస్త్రీ లందుమా! తురక స్త్రీలవలె ప్రపంచదర్శనమునకు మోముఁ వాచి యున్నారు. అంతఃపుర కాంతల కెన్ని విసర్జనీయములుగలవొ యన్ని గోషాస్త్రీలకుండినప్పుడు గదా అంతఃపురము గోషా ఒకటియన వీలగుట. ఒకమాట జెప్పి ప్రకృతకథ ముగింపఁవచ్చును. పురాణములలోఁ జెప్పఁబడిన రాణివాసము గోషాతో సంబంధింపదు. గోషా తురకలకెట్టి నియమములతో నున్నదో తదవలంబినులకుఁ బద్మనాయకస్త్రీలకు నట్టినియమములతోనే యున్నది. హిందూమతమున ద్వేషించు తురకలు మనయొద్ద గోషానేర్చికొనిరనుట యుక్తమో తురకలకు సామంతులై భూమి పాలించిన హిందువులే వారియొద్ద నేర్చిరనుటయుక్తమో ప్రతియత్నరాస్యుఁడెఱింగిన యంశమే గాన నాచర్చ మఱియొకచోట విస్తరించి చేయవలసియుంట

చేఁ బ్రస్తుతమింతతో ముగించి శాఖాచంక్రమణ న్యాయ మనుస రించుదును.

ఓ సిద్ధృత్‌పాత గోషానిషేధక వ్యాసఖండన గ్రంథకర్తగారూ! మనమందఱము సంఘాభివృద్ధికే పాటుపడువారము. అభిప్రాయభేద ములు మనకున్నను మనమిరువురము సంఘసంస్కరణాభిలాషులమే. ఈ వాదములో మీరు గెల్చినను నేను గెల్చినను సత్యాంశము తేలిన దని సంతోషింపవలసినదే. అభిప్రాయభేదములఁ దెలిపికొన్నంతఁ దప్పు లేదు. మీ రాధారములుగాఁ గైకొనిన హిందూజనుల కాముష్మిక ప్రదములగు భారతభాగవత రామాయణములలో రాజకాంతలు గోషాగైకొనిరని మీరును, లేదని నేనును, గథాంశముల నుదాహరిం చుచున్నారము. ఈయాధారములలోని సత్యాసత్యములు లోకమునకుఁ జక్కఁగఁ దెలియవలసియున్నది. రామాయణమున సీత, భారతమున ద్రౌపది, భాగవతమున రుక్మిణి, గోషాయే కానిండు రాణివాసమే కానిండు ఎంతవఱకు జరిపిరో యారీతి మనస్త్రీలచే నాచరింపఁ జేసిన వివాదమే పనియుండదు. లేదా మనమిరువురము చరిత్రకారుఁడగు నొక పండితు నకు వివాదాంశము వినిపించి సీత రుక్మిణి ద్రౌపదులు గోషాయె టులఁ బాటించిరో వారివలన విని యాసవరణ కంగీకరించినను యుక్తమే. నేను పురాణనాయికల పవిత్రాచారమే అంతఃపురనియ మములకు లక్ష్యగ్రంథముగ భావించుచున్నాడ. లేదా! ఒకరితోఁ బనియేల! మనముభయులము న్యాయబద్ధులముగాన న్యాయముగ మాట లాడికొని కులజులసమక్షమున సిద్ధాంతాంశము స్వీకరింతమనినను సంతసమే. కనుక మీచిత్తమువచ్చినటు లాచరింపుఁడు. సత్యాంశముఁ దేల్చుఁడు.

ఓ పద్మనాయకసోదర మహాశయులారా?

రామాయణములోని విసర్జనీయాంశములు నేనుచూపిన పురా ణములలోని విసర్జనీయములు (నియమోల్లంఘనములు) స్వతంత్రా

చరణములు గోషాకుఁ గలవని సహృదయు లొప్పికొనినచో గోషా రాణివాసము సమార్థద్యోతకములని నేనంగీకరించెదను. ఇన్నివిసర్జనీయాంశములుగల రాణివాసము గోషాతో సమార్థద్యోతకముఁ జేసి తమవాదము గెలిపింపఁ బ్రయత్నించిన శ్రీభాలేరావుగారి సాహసము వర్ణనాతీతము. పౌరాణికకాలమునుండి వచ్చుచున్న రాణివాసము తురకలదౌష్ట్యముచే వేయిరెట్లు నిర్బంధములకులోనై నానావస్థలకు మూలమై నామరూపాచరణాదికదూరమై గోషాయనుపేరుఁ దాల్చిన విషయము మామిత్రులిఁక నంగీకరింపవచ్చును. ఇఁక భాలేరావుగారు (రాణివాసముకాదు) గోషా పూర్వాచారమనుటకుఁ జూపినయాధారముల విమర్శింతును.

" ఇంతేగాక మహాభాష్యమున నసమర్థసమాసములో 'అసూర్యంపశ్యాః రాజదారాః ' అనియు (క్రీ. శ 1576 సంవత్సరమునకుఁ బూర్వముండిన పద్మనాయకకులావతంసులగు దామెర వేంకటపతికవిగారు తమబహుళాశ్వచరిత్రలోఁ బశ్యదసూర్యంపశ్యాయనియు వ్రాసియున్నారు. రాజపత్నులు సూర్యునిఁగూడఁజూడరనుటచే నంతఃపురమునుండి వెల్వడరని ద్యోతకమగుచున్నది " శ్రీభాలేరావుగారి విమర్శగ్రంథము. 2 పుట.

ఇవి గోషాపూర్వకాలమునుండి కలదనుటకుఁ గనిపెట్టిన సూక్తిరాజములు. ఇవి తమకాధారములని శ్రీభాలేరావుగా రెంతసంతోషించిరో విమర్శనీయములని మేమంత సంతోషించుచున్నారము. భాషావిషయమున వ్రాయఁబడిన "అసూర్యంపశ్యా" శబ్దము తమకు సాహాయ్యముఁ జేయునని మురియుట విచిత్రముగానున్నది. భాషాగ్రంథమునఁగాదు కథాసందర్భమునఁగాదు సమాసనిరూపణమున నున్న శబ్దముతో గోషా పూర్వమునుండియున్నదనుటలో నేమిసారస్యముకలదో తోఁచదు.నిఘంటువులలో నున్నట్టులచర్చలలో వ్యాకరణాది శాస్త్రములలో సైతము పదములుకానవచ్చును. ఆపదములకుఁ గథాసంబంధమెటులపొసఁగును? అవి శ్రీభాలేరావుగారిగోష కెట్టులుప

యోగించును? వ్యాకరణశాస్త్రమందలి శబ్దములతోఁ బూర్వా చారనిరూపణము లెట్టులఁ జేయ సందర్భమగునో నేనెఱుంగను. అసూర్యంపశ్యలని రాజదారలకు వ్యవహారనామముండుటచే మా విమర్శకులు సూక్ష్మదృష్టితో నంతఃపురము విడువరనియూహించిరి. పురాణనాయికలలోని సీత యసూర్యంపశ్యయే. దమయంతి యసూర్యంపశ్యయే. వీరందఱు సూర్యునిఁ గాంచియుండరనియు నంతఃపురము వదలియుండరనియుఁ దలఁప బొత్తిగా వీలులేదు. ఇట్లుతలంచిన వారిచరిత్రములే మనకు బాధకములగును. ఒకయాధునిక మహాకవి చంద్రమతి "నసూర్యంపశ్యా" యని హరిశ్చంద్రునిచే సంబోధింపఁజేసెను. చంద్రమతి యప్పటికే భర్తతోఁ బాటరణ్యము లలోఁ దిరిగి యొండలకలసి శ్రమనొందినది. ఈయమ కాకాలమున నసూర్యంపశ్యాశబ్దము సుకుమారార్థద్యోతక మేకదా. ఇంతియెగాని చంద్రమతి గోషాగాఁ దనుట కీనామ మించుకయేని వీలుకాదు. అసూ ర్యంపశ్యాశబ్దమునుబట్టి పూర్వకాలమునుండి గోషాయున్నదనుట పొందికలేని పొల్లుమాట. మహాభాష్యములోని వాక్యములు శబ్దస్వ రూపములు శబ్దదోషములు బోధించునుగాని కథాంశములు ఆచార ములు బోధింపనేరవు. నిఘంటువులలో నున్న పదములతోఁ జరిత్రాంశ ములు కథాంశములు స్థాపించుట యెటు లసంగతమో శబ్దశాస్త్రము లోని వాక్యములు ఆచారములకుఁ దీసికొనుట యటు లసంగతము. ఈసందర్భమున సుకుమారియని యసూర్యంపశ్య యను పదమున కర్థము తెలుపవలసినదెగాని మనకు వేరైనయర్థములు కల్పింపవీలు చిక్కదు. మావిమర్శకులు శబ్దప్రపంచము గాలించినను రాజకాంతలు గోషాపాటించుటచేతనే వారి కసూర్యంపశ్యలను నామమబ్బెననిస్థాపింప లేరు. దీనివలన "అసూర్యంపశ్యా" అనుపదమెట్టు లసమర్థసమా మోరావుగారి వ్రాఁతయునట్లసమర్థసమాధానమని మాత్రము తెలి యును. "సూర్యమపి నపశ్యతీ త్యసూర్యంపశ్యా" సూర్యుని సైతము చూడదుగాన నసూర్యంపశ్య యనువ్యుత్పత్తి నేపండితుఁడు పైశబ్దము

నకుఁ జేయఁడు. సూర్యునిఁ జూడకున్న నెంత యవరోధకాంతయైనను జీవించునా? సూర్యుఁడు లోకబాంధవుఁడు అట్టిచో గోషాస్త్రీల కెట్టుల ద్వేషి కాఁగలడు. అసూర్యంపశ్య యనుటచే సూర్యునిఁ జూడ నంతటి సుకుమారియను వ్యుత్పత్తిఁ జెప్పికొనవలయును. వలయునన్న నిందులకెన్నియో ఆధారములు చూపఁగలను.

శ్లో॥ అసూర్యంపశ్యత్వా దభినవసువర్ణ ప్రతినిధిః
తదా యాధ్వాం తేపి ప్రకటరుచిరాయాస మనుదత్
(తనుస్సాద్య) గ్రీష్మాతపతపనభిన్నచ్ఛవితయా
దురీక్షంస్వాంతంమే తిమిరయతి శోకేనమహతా॥

భట్ట శ్రీనారాయణ శాస్త్రి వారి కలివిద్యావిధూరణము.

ఈశ్లోకమందలి యసూర్యంపశ్య యెవతెయో పాఠకులకు విన్నవింపవలసియున్నది ఈయమ మనకుఁ జిరపరిచితురాలగు దమయంతి. దమయంతి సూర్యకిరణప్రచార మెఱుంగదందుమా? కలివిద్యా విధూరణ గ్రంథకర్తగారి ప్రయోగమే దూష్యమందమా! మనలోపము మనమే సవరించుకొందమా! ఏదియో యొకకార్య మావశ్యకము.

ససమీక్ష్యమహీపాలః స్వాంసుతాం ప్రాప్తయౌవనాం
అపశ్యదాత్మనఃకార్యం దమయంత్యాః స్వయంవరం॥

భారతము అరణ్యపర్వము. అధ్యా. 53.

తా॥ యౌవనము వచ్చినతరువాతఁ దనకుమారియగు దమయంతింగాంచి భీమరాజు స్వయంవరమునకు యోజించెను.

దీనివలన నసూర్యంపశ్యయగు దమయంతి పరిష్కృతకథాకాలమునకు సంపూర్ణయౌవనవతియని తెలియుచున్నది. స్వయంవరయోగ్యయగు నీదమయంతి సూర్యావలోకనముఁగల నాయికయైనది కానిది నేనుప్రత్యేకించి వాకొనఁబనిలేదు. ఆయమ వనవిహారములు హంససందేశము ధ్రువపఱచుచునే యున్నవి. ఆరోగ్యశాస్త్రజ్ఞులుకూడ జీవకోటికి సూర్యకిరణప్రసారమే చైతన్యప్రదమని వాకొనుచున్నారు.

శ్లోకమువలన శుద్ధాంతకాంతలకు సౌకుమార్యసూచనమున నసూర్యంపశ్యాశబ్దము సాభిప్రాయముగఁ గవులుప్రయోగింతురని తేటపడును. ఇది రసికులకుఁ బ్రత్యేకించి తెలుపవలసినయంశము కాదు. దమయంతి యెండకన్నెఱుఁగని రాచబిడ్డగాన నాయమదేహము సువర్ణోపమితమని రసజ్ఞులూహింతురుగాని దమయంతి సూర్యుఁగఁ జూడదు. అందుచేఁ బాలిపోయి ఖండాంతరులవలెఁ దెల్లపడినదని యేమనుజుఁడేని తలంచునా ? సూర్యావలోకనము ననేకపర్యాయములు సలిపిన పిమ్మట దమయంతి నలునిచేఁ బైవిధముగ వర్ణింపఁబడెఁ గాన భాలేరావుగారు సెలవిచ్చుభావ మిటమృగ్యము. ఈవిషయమును శ్రీరావుగారికింకను బోధఁజేయవలసి యున్నది. విషయవిస్తరమునకు విజ్ఞులు సహింతురుగాక.

మ॥ కమలాంభోన్నమరంశుజాలములు దిగ్భాగంబులన్ గ్రిమ్మినన్
కుముదాంతస్స్థితలక్ష్మి యెండవడసోకుల్ సైఁపఁగాలేక ప
త్రములన్ మాటుగఁజేసి కప్పుకొనియెన్ దత్కాలసంకోచన
క్రమదంభంబున రాజవల్లభ లసూర్యంపశ్యగానుర్గదా॥

పారిజాతాపహారణము ద్వితీయాశ్వాసము.

ఈపద్యమందలి రాజవల్లభలు, అసూర్యంపశ్యలు, అను పదములలో శ్లేషకలదు. అదిప్రకృతమునకు సంబంధించినదే. కుముదాంతస్థితలక్ష్మి యెండవడసైఁపలేక కప్పుకొనెననుటచే సహింపఁగల యంత యెండవడఅకోర్చి పిమ్మటఁ గప్పుకొనినటులఁ దేటపడును. కాన నసూర్యంపశ్యలును ఎండవడకుమాత్రమె సహింపరసియు సూర్యకిరణప్రసారము వాంఛింతురనియుఁ దెల్లమగుచున్నది. దీనివలనఁ గూడ నసూర్యంపశ్యాపదము సౌకుమార్యద్యోతకమని తెలియుచున్నది. ఒకవేళ విధిలేక శ్రీభాలేరావుగారు చెప్పినస్థూలదృష్ట్యర్థముచే రాజదారలు సూర్యునిసైతముఁ గాంచరని యొప్పికొనినను వారలకు గోషాగలదన వీలుమాత్రముండదు. నేను జూపిన యుదాహరణములలోఁ బలువురు రాజదారలంతఃపురమున నుండిరొ

పతులతో భాషించినటులఁ దెలియును. దమయంతి వృత్తాంతము ముఖ్యముగా నిందులకు దృష్టాంతరము. తా మసూర్యంపశ్యలై నమాత్రమునఁ బరులతో భాషించుటకుఁ బరులకుఁ దాముకన్పడుటకు రాజదారలకు వీలుకాకపోదు. ముక్కుతిమ్మన్నగారి పద్యముప్రకారము కుముదాంతి క్షితలక్ష్మి అసూర్యంపశ్యయై యెంతగోషాపాలించుచుఁ బరులకుఁ గానరాకున్నదో రాజదారలుగూడ నంతగోషా పాటింతురని మావిమర్శకులు తెలిసికొందురుగాక. అసూర్యంపశ్యాశబ్దముతోఁ బూర్వము గోషాయున్నదని సాధించుట "పృష్టతాడనాత్ దంతభంగః" అను శ్లోక భాగమును జ్ఞప్తికిఁదెచ్చుచున్నది. అవసరమున్నంతవఱకు రాజపత్నులంతఃపురము వెలువడరని నేనొప్పకొంటిని. ఒకరాజపత్నులేకావలయునా? అవసరమైనపుడు ప్రతివారు గృహములవిడచి వెలుపలకేతెంతురు. అవసరములేనప్పు డేస్త్రీయు బయటికిరాదు. దీనికిఁ బూర్వాధారములే చాలును. అసూర్యంపశ్యాయనుటకు సూర్యునిఁజూడరు గాన నంతఃపురము వెల్వడరను నర్థము విశ్వసనీయముకాదు. భాలేరావుగారు వాక్యార్థము పట్టుకొని వ్రేలాడుట సమంజసమా? గోషాగలవారు సూర్యునిఁజూచినఁ దప్పేమి? గోషాకు భంగమాయేమి! ఔను పరపురుషుఁడుకదా!

సూర్యునికంటెఁ జందురుఁడే దుష్టస్వభావుఁడని మనపురాణముల వలనఁ దెలియుచున్నది. చంద్రుని దటి లోకువయగు గోషా సూర్యునిదటి యేలకావలయునో! పాపము విమర్శకులు సర్వసాధారణముగ రాజపత్నులు సాయంసమయమున నుద్యానవనవిహారము, క్రీడాసరోమజ్జనము, సలిపినటులఁ బ్రబంధములలోఁ జదివియుండలేదుకాఁబోలు. చదివి యర్థముఁగావించికొనిన నసూర్యంపశ్యాశబ్దమున కీయర్థముఁ జెప్పరు. ఒకానొక కవి తన ప్రబంధనాయకుని "కనకకోటిబాలార్కతేజోనిధి" యని సంబోధించెననుకొందము. అతఁడు నిజముగఁ దొమ్మిదికోటులసూర్యులవంటి కాంతిఁగలవాఁడు,ఆతని భార్య అసూర్యంపశ్య గానఁ బరస్పరావలోకనము, సంస్పృతిసంబంధము లేకపోయితీఱునని

యేవెఱ్ఱివాఁడేని తలంచునా! మన భాషలో గుణబోధయం దతిశయోక్తి ముఖ్యముగనుండును. ఇందులకు నిదర్శనముగ, శైలకుచ, కృశోదరి, లతాంగి,లోనగుపదములు వెయ్యి కలవు.పదమునకుఁ బ్రయోగసిద్ధిచే గౌణార్థమే గ్రహింపఁదగినది. శ్రీభాలేరావుగారు గోషా పూర్వమునుండి కలదనుటకు మహాభాష్యమంతటి గ్రంథము నుదాహరించియు వ్యర్థప్రయత్నులైనందులకు నేను విచారపడుచున్నాఁడను.

శచీదేవిని ఇంద్రుఁడు "అసూర్యంపశ్యా" యని పిలచెను. దీనిచే శచీదేవికి గోషాయున్నటు లూహింపనగునా? త్రిమూర్తులు తమ కులకాంతలను నసూర్యంపశ్యాయని సంబోధించినమొదల వారల మెడలకు గోషా యంటగట్టవలసినదేనా? ఇప్పుడు బ్రాహ్మణులగు జమీందారులగేహినుల సర్వసాధారణముగఁ గవులు నసూర్యంపశ్యలని వర్ణించుచున్నారు. అట్టిచో వారలకందఱకు గోషాకలదన నేసహృదయుఁడేని సమ్మతించునా? ఈవిషయమై విమర్శకులు సందియముతీఱకున్నఁ బండితులనడిగి సంశయనివృత్తి సలుపుకొందురుగాత.

ఇఁక భాలేరావుగా రుదాహరించిన రెండవయుదాహరణమును బరిశీలించుదును.

"పద్మనాయక కులావతంసులగు దామెర వేంకటపతిగారు తమ బహుళాశ్వచరిత్రములో పశ్యదసూర్యంపశ్యా అని వ్రాసియున్నారు. రాజపత్నులు సూర్యునిఁజూడరనుటచే నంతఃపురమునుండి వెలువడరని ద్యోతకమగుచున్నది."

అని శ్రీభాలేరావుగారు విమర్శములో వ్రాసియున్నారు. పద్మనాయక కవి వ్రాసిన యంశముగాన మాయుభయుల కీవిషయము శిరసావహింపఁదగినదే. ఇది యేసందర్భమున వ్రాయఁబడినదో యీశబ్ద మేవిషయమున వాడఁబడెనో విరళముగ వ్రాయక కేవలశబ్దముతో నిర్ధారణము చేయఁబూనుట సాహసము. నిష్పక్షపాతవిమర్శమునకు విరోధము. సత్యమునకు విరోధము. కాన మావిమర్శకులు తమ కవసరమైనంతవఱకు స్వీకరించి మిగిలినభాగము తమయూహకు

వ్యతిరేకమని వదలినను నేనుదాని నుదాహరించి పరిశోధించెదను. దామెర వేంకటపతికవిగారు బహులాశ్వచరిత్రములోఁ గృష్ణుఁడు రథ మెక్కి పురవీధులనుండి పోవుచుండుసందర్భమును సాకల్యముగ వర్ణించుచు.

"పశ్యదసూర్యంపశ్యా దస్యుమధ్యమా సమాలోకన భ్రమా గత కితవనివహంబు".

అని వ్రాసియున్నారు. (శ్రీకృష్ణుని) చూచుచున్న యసూర్యం పశ్యలఁ గాంచవలెనను భ్రమతో నేతెంచిన జూదరులుగల యుత్సవ మని దానికర్థము. కృష్ణునిజూచుటకు వచ్చుటచే నంతఃపురము నసూర్యంపశ్యలు వెలువడుదురని తేటపడుచున్నది. అసూర్యంపశ్య లంతఃపురములోనుండియే గవాక్షరంధ్రములనుండి కృష్ణునిఁజూడ రాదాయని విమర్శకులందురేమో! ఆయూహ కవకాశములేదు. కృష్ణసందర్శనమున కసూర్యంపశ్యలు వచ్చుచుండిరిగాని యసూర్యం పశ్యల దర్శనమునకుఁ గృష్ణుఁడు వచ్చుటలేదు. అసూర్యంపశ్యలు ధారాళముగ బయటికేతెంచి కృష్ణునిఁజూచుచుండ వారలఁజూడవలయు నని జూదరులు బయలుదేరిరి. అసూర్యంపశ్య లంతఃపురగవాక్షముల నుండి కృష్ణునిఁజూచుచు గోషాపాటించుచున్నఁ గితవనివహంబునకు వారలసందర్శింప నేలయుత్సాహముకలుగును. అదియెటులఁబొసఁగును. శ్రీకృష్ణునియంతవాఁడే గోషాలేకుండ తనమహిషితోడ రథము నెక్కి రాజవీధుల నేగుచుండ వారలఁజూడవచ్చిన యసూర్యంపశ్యలకు గోషాకలదనియు వారంతిపురి వెలువడరనియు మావిమర్శకుల కెటుల ద్యోతకమైనదో? కాన నసూర్యంపశ్యలన నంతఃపురి వెలువడువారనియుఁ బరులఁగాంచువారనియు నుత్సవసందర్భములఁ బలువురు వారలఁదిలకింతురనియుఁ బై వచనముచే వెల్లడియగుచున్నది. ఈయంశము నంతయు నుదాహరించినఁ దమవాద మడుగంటునని పాపము భావేరావుగారు "పశ్యదసూర్యం పశ్యా"పదము మాత్రమె యుదాహరించిరి. వారి గుట్టు బయటబెట్టినందులకు నామీఁదఁ గన్నెంతయెఱ్ఱచేయుదురో?

నేని బెదరింపులకు వెఱచినచో సత్యాంశము మాటుపడవలసివచ్చును. మఱియు వేంకటపతిగారీసందర్భముననే.

“కించిదాచ్ఛాదిత కవాటభాగభాస్వసామాన్య రాజన్య కన్యకా బింబోష్ఠీకంబు”

అని వ్రాసియున్నారు. దీనిచేనసామాన్యరాజకన్యకలు సైతము కొంచెము మూసియున్నగుమ్మములకడ (సాంగముగమూసియున్న గవాక్షములుగల గుమ్మములకడఁగాదు) వసించి యుత్సవమును జూచి నటులఁ దెలియుచున్నది. కన్యలనఁ బడుచువాండ్రుకాని బాలికలని శ్రీభాలేరావుగారు వాకొనవీలులేదు. బింబోష్ఠియనువిశేషణము యౌవనవతులనుభావము స్ఫురింపఁజేయును. అసామాన్యరాజకాంతలే కొంచెము మూసినగుమ్మములకడ యథేచ్ఛగ సంచరించుచున్నటుల వేంకటపతికవిగారు కంఠోక్తిగఁ బలుకుచుండ అసూర్యంపశ్యలు కితవ నివహసందర్శనోచితముగ నుండిరని తెలియుచుండ వేంకటపతిగారి మతమున గోషాయున్నటు లూహించుటయు రాజకాంతలు అసూర్యంపశ్యలు గృహములు వెలువడరని యూహించుటయుఁ బొరపాటు. గ్రంథముఁబట్టి కవియొక్క స్వభావము గ్రహింపవచ్చునని తద్జ్ఞులందురు. వేంకటపతిగారి గ్రంథముఁబట్టి చూడ నాయనమతమున గోషాయంగీకారముకాదని తెలియుచున్నది. అసామాన్యరాజకాంతలు యథేచ్ఛగఁ జరించుచుఁ బురుషులకు దర్శనమొసంగుచుండనిఁకసామాన్యుల సంగతిఁ జెప్పనవసరములేదు “మహాగజాఃపలాయంతే మశకానాంతుకాకథా” అనినట్లు. ఇప్పటికి శ్రీభాలేరావుగారి రెండాధారము లెగురకొట్టఁ బడుటయేగాక రెండుఆధారములు మాకుఁదోడ్పడఁజేసితిని. పూర్వాను క్రమముగ మిగిలిన యుదాహరణముల విమర్శించి శ్రీభాలేరావుగారి నిష్పక్షపాతవిమర్శము పసతేల్తును.

బాణాసురుని కుమార్తెయగు నుషతోఁ బ్రద్యుమ్నుకుమారుఁ డొనరించుచున్న రహఃప్రచారములు ద్వారపాలకు లెఱింగి

తమకొంప యేమిమునుఁగునో యని బాణాసురునితో మొత్తుకొను సందర్భమునఁగల.

క॥ మంతనమున దేవరక
న్యాంతఃపుర మేము గాచి యరయుచునుండన్
వింతజనములకుఁ జొరఁగ దు
రంతము విను పోతుటీఁగకైన సురారీ॥

అను భాగవతపద్యము నుదాహరించి దానికి సారాంశముగ "రాణివాసమనఁగా గోషాయని మననిషేధక వ్యాసకర్తగా రొప్పుకొనక తప్పదు. పోతుటీఁగకైన సురారీ యనుటచే మగయీఁగకైనఁ జొరశక్యము కాదనుటఁబట్టి మగజంతుజాలమే చొరశక్యముగానిచోఁ బరపురుషులకెట్లు చొరశక్యమగును" అని విమర్శకులు వ్రాసిరి. రాణివాసమన గోషాయని నేనొప్పుకొనక తప్పదఁట. ఒప్పుకొనను. ముమ్మాటికి నొప్పుకొనను. తప్పితీఱును. ఉషాకన్యకకు రహస్యముగ భర్తచేకూరిన యంశము విని బాణాసురుఁ డిది యంతఃపురఁపుఁ గావలి వాండ్రలోపమని భావించి వాండ్ర బెదరింప రాజగార్జన్యమునకు వెఱచి పలికిన మృషావచనమె రావుగారికిఁ బ్రమాణమైనది. మగయీఁగను సైత మంతిపురికిఁ జేరకుండఁ గాచినయంశమెంత సత్యమో యంగజాలలు ప్రాణభీతిచేఁ బలుకుపలు కంత సత్యము. సాధారణముగఁ జేలగాపరులవద్దకుయజమానులువచ్చి ఓయీ! పైరుపోయినటులున్న దే. ఏరేని హరించిరా! యన బాబు! నేను జేనుకాచియుండఁ గాకి గ్రద్ద వాలునా? యనును. ఇది సత్యాంశమని విశ్వసింప వీలుచిక్కునా? తార చంద్రునితోఁ.

ఉ॥ "లోకములోని కొందఱబలుల్ సతులం దనియింపలేక న
స్తోకమనీష నన్యపురుషుల్ తమకాంతలనంటకుండఁ దా
టాకులలోన వ్రాసిరి పరాంగనఁ గూడిన పాపమంచు"............

ఇటుల వాకొనఁగదా! కథాసందర్భ మావలకుఁద్రోసి తార దురభిప్రాయము విమర్శింపక, కవియౌచితి తలపోయక, పరాంగనా

ని తమనియు నశక్తులగు పురుషపాత్రియులువ్యభిచారము దోష
~ వాళ్ళనిరనియు నూహించుట యెంతయు క్తమో, విమర్శక మహా
శయులు పై యంగజాలలపద్య మాధారముగ స్వీకరించుట యంత
యుక్తము. అంతఃపురద్వారముల నంగజాలలు కాచియున్నంత
మాత్రమున రాజకాంతలకు గోషాయున్నదని తలంపవీలుండదు.
మండలాధిపతుల కార్యస్థానములముందు రాజులయిండ్లముందు ధనవం
తులగృహములముందుఁ గావలి వాండ్రుంట నైజము. మండలాధిపతు
లకు, రాజులకు, ధనవంతులకు, గోషాకలదని యూహింపవీలుచిక్కదు.
అటులనె యంతఃపురములకుఁ గావలివాండ్రున్నను అంతఃపురవాసిను
లకు గోషాకలదని చెప్పుట సాహసము. ఇందులకు రామాయణములో
నుండియు భాగవతమునుండియు నితరచరిత్రముల నుండియు నుదా
హరించిన కథాభాగములు చాలును. అంతఃపురవాసినులు కార్యాన
సరమునం దెట్టిసమ్మర్దస్థలముల నేని యెట్టి రాజాస్థానముల నేని చరించు
చున్నారు. వారిస్వాతంత్ర్య మైచ్ఛికము. భటులచే ద్వారములు
రక్షితములై యుండ నంతఃపురమునఁ గన్యాదశలోనున్న దమయంతి
కెంతగోషాకలదో యథార్థమున కుషాకన్యకు నంతియగోషా కలదు.
నలుఁడు దమయంతితో ద్వారపాలుర కనులఁగప్పి రాత్యకథలు
ప్రసంగింపలేదా! అటులనే యనిరుద్ధుఁడు నుషాకన్యతో స్వేచ్ఛా
చరణ మొనరించుచున్నాఁడు. అంతఃపురావాసము గోషాతో సమా
ర్థము కాఁజాలదు. రెంటికి సంబంధము లేదు. ఈవిషయమై యిది
వఱకె విస్తరించి వ్రాసితిమి.

రామాయణములోని విసర్జనీయాంశములు పురాణకాంతల
యంతఃపురావాసనియమములు మనయుషాకన్యకు నన్వయించునవియే.
ఇంతకు నీపద్యవిమర్శ సారాంశ మేమియనఁ గడుపుకక్కుర్తిచేతను
ప్రాణభీతిచేతను రహఃకథలు అనిరుద్ధ పరిచయాదులు కాఁచి
పలుకు సావిదల్లులపలుకు లుదాహరింపఁదగనివనియు నుషాకన్య రాణి
వాసము గోషాకుఁ బోలినది కాదనియు దీనినొకయాధారముగఁ దీసి

కొని విమర్శకులు పరుగెత్తుట పరిహాసములాడుట పరితోషమందుట పనికిమాలినపనియనియె. ఇది ఎడమచేయికాదు పుర్రిచేయి యన్నటు లున్నది. ఏమికర్మముగాని శ్రీభాలేరావుగారి దృష్టాంతరములన్ని నష్టాంతరములగుచున్నవి. ఆధారములు వారములగుచున్నవి. ఇంతతో విమర్శకులు శాంతించిన బాగుండును. శాంతించిరా! లేదు. ఆంధ్ర మహాభారతములోని విరాటపర్వము నాధారములకొఱకై వెదక సాహసించిరి. వెదకివెదకి సుధేష్ణకు జన్మమున లేని గోషాబురకావేయుటకుఁ దగినదిగా నొకపద్యమును దీసికొనిరి. పాపమెంత విరాటరాజు పట్టమహిషియైన నేమి! యెంతసాధ్వియైన నేమి! విమర్శకుల మృషా కల్పనముచే సుధేష్ణయు మహమ్మదీయాచారావలంబనము కల దయ్యెను. చూడుఁడు.

"ఆ. వె॥ అనిన సంతసిల్లి యద్దేవి సైరంధ్రి
నూరడిలఁగఁ బలికి యునిచికొనియె
నంతిపురము చరిత కలవడ మెలఁగుచు
నుండె నవ్వధూటియును ముదమున॥

ఈపద్యమును విమర్శకు లుదాహరించి "సుధేష్ణాదేవికి గోషా లేకుండియున్న సైరంధ్రియేల" యంతిపురము చరిత కలవడ మెలఁగవ లెను అనియున్నది. కనుక గోషాయుండెననియే స్థిరపడుచున్నది" అని వ్రాసిరి. ఈ వ్రాఁతకుఁ బైపద్యమునకు నించుకేనియు సంబంధము లేదు. "అంతిపురంపుఁ జరిత కలవడమెలఁగుచు ననిపద్యమునఁగలదు గాని యంతిపురము చరితకలవడ మెలఁగవలెనని పద్యమందు లేనేలేదు. విమర్శకు లీకల్పనము నావ్యాసము విమర్శించి విజయమందుటకే చేసి యుందురు. తమకుఁగావలసిన యూహయు నాధారమును బద్యమునఁ గలదని భావించి విమర్శకులు తొందరపడుచున్నారు. తిరుగ నొకతూటి వారివ్రాఁతను బద్యమునుజూచి సవరించుకొందురుగాఁత. పైపద్యము వలన సుధేష్ణకు గోషాయున్నటులఁ బొడకట్టుట లెంతయసంగర్భము. ఎంత పొరబాటు. వీరివ్యాఖ్యానము శ్లాఘాపాత్రముగానున్నది. ఎచ

టనో గొట్టనేవియో రాలినటులఁ గవియేదియో వ్రాయ వీరేదో యనుకొనిరి. అగర్భశ్రీమంతురాలును సుకుమారియు నగు ద్రౌపది తాను పరకాంతలచే సపర్యలనందుటయేగాని పరకాంతలకు సపర్యలసలుపుట నేరనిదయ్యును గష్టకాలమున అంతఃపురదాస్యకృత్యముల కలవాటు చేసికొని మెలఁగుచుండె ననుభావము "అంతిపురము చరితకలవడ మెలఁగుచు" నను పదమున స్పష్టముగాఁ గలదు. అంతిపురము చరితయన నంతఃపురాచరణము. ఈయాచరణము గోషా కాదు. ముమ్మాటికిని కాదు. రాణిగారి దాస్యమునకు వచ్చుదాసికి అంతఃపురాచరణములు తెలియవలయునుగదా! అవియే సైరంధ్రి కలవడినవి. ఇంతమాత్రమున గోషాయున్నట్టుల (సైరంధ్రికో సుధేష్ణకో తెలియదు) విమర్శకు లెటులూహించిరోగాని ప్రపంచ మీయసందర్భలేఖనమును బరిహాసించుచునేయున్నది. సుధేష్ణకు గోషా లేకపోయిన మగవారిచే దాస్యము చేయించుకొనునా! సాధారణముగ నంతఃపుర కాంతలకు దాస్యకర్మలు స్త్రీలు చేయఁదగినవేయనివిమర్శకులు పురాణపఠనమువలననేని తెలిసికొనఁజాలరైరని విచారపడుచున్నాఁడను. సామాన్యముగ దాస్యవృత్తి స్త్రీలకు స్త్రీలె చేయఁదగినది. ఇది మనసునందున్నచో భాలేరావుగారీపద్యము విమర్శింపరు. రాజ కుటుంబములోఁ జేరినవారుకాక యన్యులు సైతము దాసీకృత్యముల నాఁడువారిచేఁ జేయించుకొనుచున్నారు. కాని మగవారిచేఁ జేయించికొనుటఁ జూచుచున్నారమా? దాస్యవృత్తిఁ గలవారిని బాలించువారందఱు గోషాకలవారని విమర్శకు లూహించి యింతవిమర్శము మాచేఁ జేయించిరి. ఇది యంతయు నెత్తికొఁగట్టుకొనినది నా పెండ్ల మనినటులున్నది. మునుపటి భాగవతాధారమెంత బలీయమైనదో యీభారతాధారము నట్టిదే. భారత కాలమున స్త్రీలకు గోషా లేదని నేను మునుపె పూర్ణముగ నుదాహరించియుంటిని. అది మఱలఁ బరిశీలించి భారతభాగవతరామాయణాదులలో నిట్టియాధారము లుండవని మిన్నకుంటయుక్తధర్మము. విమ

ర్శకు లింతతోఁ దృప్తివహింపక నైషధములో "వివిధరత్నాధికృత పాలితంబులైన రాజశుద్ధాంతభవనకక్ష్యాంతరం బేపరికారంబునఁ బ్రవేశింతు" అని యున్నదని వ్రాసికొనిరి. ఇది తమకెట్టియాధారమో దీనివలనఁ దమపాఠకులకెట్టివిషయము బోధింపనూహించిరో తెలుపుట మానిరి. కేవలశ్రీనాథవాక్యమువలన నూహింపవలనైన యంశము లేదు. కావునే భాలేరావుగారిటుల విడచియుందురని నాతలంపు. ఈయంశమును నైషధము విమర్శనుచేయుసందర్భమున విపులముగ విమర్శించియే యున్నాఁడను నేను విమర్శించిన యంగజాలలవాక్యములు పరిశీలించిన నైషధములోని వచనము నాధారముగాఁ దీసికొనఁ బ్రకృతముగాదని పాఠకు లెఱుంగకపోరు. ఈయంశము నితఃపూర్వము చర్చించియే యున్నాఁడ. విమర్శకులు పింగళి సూరకవి ప్రభావతీప్రద్యుమ్నమునుండి యొకయాధారమునుదాహరించిరి. అదియే యిది.

"సీ॥ వజ్రనాభుఁడు రాజ్యవైభవంబంతయు
మెఱసి నానాబంధుమిత్ర సచివ
సంఘంబుతోడ నాస్థానమహామంట
పమునందు నొడ్డోలగముననుండి
పగలుదృష్టికి నగోచరముగ సంవృత
స్థలినిల్పి రాణివాసంపుజనంబు
చూచునట్టుగఁజేసి సొంపారు వేడ్కతో
సావధానస్వాంతుఁ డగుచుఁజూడ॥"

విమర్శకు లుదాహరించిన యాధారములలో నిదియే యించుకసేపు నిలువఁదగిన యాధారము. ఈయాధారము మూలమున విమర్శకులు కృతార్థులు కాఁగలరని పాఠకులు తలంతురేమో! అదియు నసంభవమే. క్రీ. శ. పూ॥ 4000 సంవత్సరములకుఁ బూర్వమున (పురాణయుగమున) లేని గోషామరాచారము క్రీ. శ. 1640 ప్రాంతముల నున్న సూరకవి యున్నటులఁ బ్రబంధమున వ్రాసిన విశ్వసింతు

ర్గా! సూరకవియుఁ దనగ్రంథమున వజ్రనాభునిస్త్రీలకు గోషా యున్నటులఁ జెప్పలేదు. ఒకవేళ నున్నటులఁ జెప్పినను బూర్వాచారముగ లేని యీయంశము రసజ్ఞు లామోదింపఁ జాలరు. ప్రబంధరచన కాలమున మనదేశమున గోషాదురాచారము ప్రబలి యుండుటచే దాని నాదర్శముగాఁగొని ద్వాపరయుగములోని కథకు గోషాకు సూరన ముడిపెట్టినాఁడు. ఇది యాయన యొనరించిన యౌచితీ భంగము. ఈకవికిట్టి యలవాటు కలదని విమర్శకు లంగీకరించిన కట్టమంచి రామలింగారెడ్డిగారే తమ కవిత్వతత్త్వవిచారములోఁ గళాపూర్ణునియుద్ధమునఁ దుపాకులుబల్లెము లుపయోగించుటను బరిహసించి యున్నారు. ఈప్రభావతీప్రద్యుమ్నములోని పద్యాంశము నట్టిదియే. భారతవిరాటపర్వమున సుధేష్ణ పటువమాఱు భీమసేనుని వీరకృత్యముల వినోదార్థము చూచినటులున్నది. కాని యాయమ యాచ్ఛాదనము చాటున నున్నటుల్ల లేదు. ఇది సూరకవిగారి ప్రమాదము. దీనిని రావుగారు స్వీకరించుట మఱియుఁ బ్రమాదము. మాకుఁ బ్రమోదము. ఆధునికయుద్ధోపకరణముల ద్వాపరయుగకథలోఁ బ్రయోగించుటవలె నాధునికాచారము ద్వాపరయుగకథలోఁ బ్రచురింపరాదు. అదిగాక స్త్రీలు సభాస్థలముల వినోదములుచూచునపుడు మంత్రి సామంతాది మహాజనవేష్టితమగు సభాస్థానమున మగనిప్రక్కనఁ గూర్చుండుట యుచితమని మాయభిప్రాయముకాదు. గౌరవనీయములగు బ్రాహ్మణకుటుంబములకుఁ జెందిన బ్రాహ్మణి తనయింటజరుగు వినోదము బంధుహితజనవేష్టితమగు మగనిపార్శ్వమునఁ గూర్చుండి తిలకించునా? అట్టితఱి బ్రాహ్మణి కెంతగోషాకలదో యస్మదాదులును గోషానంతియపాటించుట ధర్మమని మాముఖ్యాభిప్రాయము. ఆచారములకు బ్రాహ్మణుల దృష్టాంతరముగఁదీసికొమ్మని మహర్షులు వాకొనుచుండ మనము మతవిషయమునఁ బ్రతికూలురగు తురుష్కులఁ దీసికొనుటకంటె లజ్జాకర మింకొకటి కలదా!

"........జీవము లేనికొంటెతవలన నొకబ్రాహ్మణుడు వేఱొకచోట బ్రదుకు వెదకికొనుటకై రాజ్యము దిగవిడువఁగోరునేని ........రాజు బ్రాహ్మణసంఘముకడకుఁబోయి ఇపుడు లోకులు తమ్ముమర్యాదలందు మెలపుట కెవనిఁబ్రమాణముగఁ గొందురు. ఈబ్రాహ్మణుడు రాజ్యమువిడచిపోవుచున్నాఁడే యనిచెప్పవలెను."

(సంస్కృతమునకు సరియగు తెలుఁగు)

భారతము శాంతిపర్వము. 69 వ అధ్యాయము.

"బ్రాహ్మణులు తక్కినవారిని లోకమర్యాదలందు మెలపుటకుఁ బ్రమాణభూతులు" —ప్రతాపచంద్రరాయలు.

ఇందుదాహరింపఁబడిన మర్యాదయే యాచారము. బ్రాహ్మణులకు లేనిగోషాయాచారము తదితరులకు మ్లేచ్ఛసంపర్కము లేకున్న నెటులవచ్చిపడును? అన్యులగు రాజులదౌర్జన్యమువలననే బ్రాహ్మణాచారములు ప్రజలయందు నశించినవి. బ్రాహ్మణులకు మున్నెన్నఁడుగోషా లేదుగానఁ దదనుయాయులగు క్షత్రియులకు నితరప్రజలకు నీదురాచారము లేదని విమర్శకు లంగీకరింతురని మాతలంపు. గోషా తీయుమని నేనన విమర్శకులు బజారునకీడ్వవలదని చిలుకపలుకులు పలికిరి. ఇటుల విమర్శకులు భావించుటతగునా? అట్టిమాట పలువురువినినఁ బరువుదక్కునా? పెద్దలుమన్నింతురా?

విమర్శకు లుదాహరించినది రాక్షసునియాచరణము. రాక్షసాచారములకు దైవతాచారములకు వ్యత్యాసముకలదు. దైవతాచారమె మనుజులకు యోగ్యమైనది. తననీడకుఁ దానుబెదరుచుఁ దపము చేసికొని పసులు తనరాష్ట్రమునఁ బ్రవేశింప వీలుకానటుల వరమందిన మహానుభావుఁడు, సురద్వేషి, దుర్మార్గశిరోమణి, పాటించుదురాచారములు మన మనుసరింపఁగాఁదగినవి కావు. ఇట్టియాచారములు దేవభూదేవాదుల విషయమువనున్నట్లు పొడకట్టను. ఇదియు వారివాదమునకు దుర్బలమేయని విమర్శకులకు మనవిచేయుచున్నాడను. గోషా

పాటించుచు నాఁడువారితో మనవిమర్శకులే ధూమశకటప్రయాణము చేయుననుకొనుఁడు. గోషాకాపాడుకొనుటకు నుద్యోగస్థులకు లోఁబడ వలసివచ్చును. అపుడు తౌత్రిచిహ్నమని విమర్శకులు తలంచు గోషాయో గోషాచిహ్నమనితలంచుతౌత్రమో త్యజింపవలసివచ్చును. గోషాయొక్క ఫలితమిది. గోషాగలస్త్రీలు బండిలోవెళ్లుచుఁ బ్రపంచ మును జూడరాదా? గవాక్షరంధ్రములు లేవాయని మావిమర్శకులు సెలవిచ్చిరి. అద్దములోనుంచి ప్రపంచము నెంతగాంచనగునో చిత్రి పటమాలమున నభిలషిత ప్రదేశ మెంతచూడనగునో గోషాస్త్రీలకు శకటగవాక్షములంతసహాయపడఁగలవు. విమర్శకులీ యంశము నెన్ని విధముల సమర్థింపఁ జూచినను జరుగుపాటుచాలక సాధారణులరీతి తిరుగు పద్మనాయక స్త్రీలు వేనవేలుకలరని సత్యబద్ధుఁడనై నేను వాకొనకతప్పను. గోషా విడచిపెట్టిన యువతుల ప్రసంగమునకుఁబోక విమర్శకులు గోషా విడచిపెట్టుమను నన్ను విమర్శింప సాహసించిరి. గోషావిడచిన నీప్రాయశ్చిత్తమని యేధర్మశాస్త్రమునందును వ్రాయఁ బడలేదు. కాన దీనియాచరణ మావశ్యకమైనదని యెవ్వరు చెప్పఁగలరు? విమర్శకు లింతతోఁ బ్రకృతాధారముల ముగింపక రాజకవియగు శ్రీహర్ష చక్రవర్తి రత్నావళినాటకమును బయటికిఁదీసిరి. ఈక్రింది వాక్యమును గోషాస్థాపనకై యుదాహరించిరి.

“యౌగంధరాయణ— అన్యథా అంతఃపురే బద్ధాయాః అస్యాః కుతో దేవేనదర్శనం అదృష్టాయాశ్చ వసుభూపతినో కుతః పరిజ్ఞానం ఇత్యాది”

ఈయుదాహరణమునందలి వ్రాఁతలోపముల సవరించితిని. ఈవ్రాఁతవలన గోషా పురాణకాలమునుండి యున్నదని వాదింప విమర్శకుల కెటుల వీలు చిక్కినదో గోచరించుటలేదు. పైవాక్యములు చదివినవారికి రత్నావళినాటిక పఠించినవారికి గోషా పురాణ కాలము నుండియు లేదని స్ఫురింపకపోదు. ఇదియు మున్ను మేముదాహరించిన యాథాతములలోఁ జేర్పవలసినదె కాని

యిప్పటికి రత్నావళినాటిక పఠింపలేదు. గ్రంథకర్తగారికీ సందర్భమున గీర్వాణభాషన యించుకేని లేదని తెలిసికొంటినిగాని యొకరివలన వినినపుడేని ప్రకృతాంశముఁజక్కఁగా వినరైరని వ్రాయవలసివచ్చినం దులకు విచారించుచున్నాఁడను. ఆహా! ఏమి భాలేరావుగారి దగ్ధ విద్యావైశద్యము. ఈ యసంబంధవ్యాసంగమునుండి విమర్శకు లింక నయిన బయటపడకున్నారు. వీరియుదాహరణమునకు వీరొనరించిన యన్వయము చూపి యభిప్రాయము స్పష్టముగాఁదెలిపి పిమ్మట నాప్రత్యుత్తరము వినిపింతును. పాఠకులారా! సావధానులుగ కండు. పై సంస్కృతవాక్యమున కర్థము "అట్లుగాకున్న యెడల నంతఃపుర మునందు (రాణిచే)బద్ధురాలైన సాగరికయొక్క దర్శనము వసుభూపతి కెట్లులగును? (బద్ధురాలగుటచే) కానరాకున్న సాగరికను వసుభూపతి యెట్లుగుర్తించును" అని. ఈ వాక్యములలో నెవరికేమి గోప్యమున్న టులఁ బొడకట్టుచున్నదా! పాపము భాషాస్వరూపమెఱుఁగని భాలేరావుగారు 'అంతఃపురేబద్ధాయాః' అను వాక్యముఁ దీసికొని యంతిపురినందఱు బద్ధులైయుందురని భ్రమపడియుందురు. సాగరిక యను చిన్నదానిని వాసవదత్తయను రాజ్ఞి సాఁకుచుండెను. వాస వదత్తను మోసగించి సాగరిక రాజుపై(వాసవదత్తభర్తపై) ననురా గమువహించి దర్శనభాషణాదులతోఁ దృప్తిపడుచుండ రాణిగారీయం శము నెఱింగి సాగరికను ఎవ్వరికిఁదెలియకుండ నుండునటులొక యం తఃపురమున బంధించెను. "అంతఃపురేబద్ధాయాః" అనునది సాగరిక యవస్థయే. ప్రభువు సాగరికబద్ధురాలైన యంశమెఱుంగక యాయమ పైఁగలవలపుబలిమిచే బరితపించుచుండ మంత్రియగు యౌగంధరాయ ణుఁడు గారడిచేయుదునని రాజగృహముఁబ్రవేశించి యట నగ్నిని గల్పించెను. ఈయగ్నిజ్వాలలచే నంతఃపురమున బంధీకృతురాలైన సాగరిక దగ్ధమగునని రాజ్ఞియాయమను విడచిపెట్టెను. అప్పుడు రాజు మంత్రినిఁజూచి యంతఃపురమున నేలయగ్నినిగల్పించితివని కసరై చెప్పిన వాక్యము భాషించెను. కథాపూర్వోత్తరమిది. దీనిని బ్రశంసింపక

తమకూధారము నేని తాము సాధింపక శ్రీహర్ష రత్నావళినుండి యే వాక్యమునో యుదాహరించి గోషాస్థాపింపఁ బ్రయత్నించుట సాహసకార్యము. తా ముదాహరించిన యంశ మే హేతువులచే సాధ్యమో చెప్పికొనవలదా! అంతఃపురములో సాగరికనుంచి రాణి గారు తాళముబిగించి యుండ సాగరికకు గోషాకలదని మాభాలేరావు గారు మురియుట పరిహాసాస్పదము. అంతఃపురమున బంధీకృతు రాలగు సాగరిక గోషాయువతి యెట్లుల కాఁగలదు. రాణి యామెను బయలు కనుఁగొనకుంట కై బంధించెఁగాని యిప్పటి విమర్శకమహాశయులరీతి గోషాకొఱకు బంధింపలేదు. గోషాకొఱకు మనము యువతుల నంతః పురముల బంధించుచుంటిమిగదా! సాగరికయు నట్టిదేయని మావిమ ర్శకులు స్థూలదృష్టితోఁ బరిశీలించి తెల్లఁబోయిరి. రత్నావళినాటిక వలన వాసవదత్తయు సాగరికయుఁ బురాణకాంతలవంటి రాణివాసము కలవారని తేలుచున్నది. నాలుగవయంకమున సాగరికయు, వాసవ దత్తయుఁ, బ్రభువు, యౌగంధరాయణుఁడు, వసుభూపతి, బాభ్రవ్యుఁడు, నొకయెడనే సమావేశమగుిరి. దీనివలన సాగరికకు వాసవదత్తకు నెంతగోషాకలదో మాపాఠకులు సులభముగ గ్రహించి యుందురు. ప్రకృతాంశ ముఁదమకాధారమని విమర్శకు లుదాహరించు కొనిరి. దానినిఁ బరిశీలింప నాకెయాధారమైనది. నాకీసాహాయ్య మొనరించినందులకు శ్రీభాలేరావుగారికిఁ గృతజ్ఞతాపూర్వక వందనము లొనరించుచున్నాఁడను.

ఓ భాలేరావుగారు! ఇట్టినిరర్థకపుహేతువులతోఁడనే గోషా యనాదిసిద్ధమని మీరు వ్రాసినంతనే యొప్పుకొనుట సంభవించునా? ఒకగ్రంథమువలన నని యేల మీరుదాహరించిన సర్వాధార ములవలనఁగూడఁ బురాణకాలమునుండి గోషాలేమి వ్యక్తమగు చుండఁగా మీరీరీతి వ్రాయుటకుఁ గలమెట్టులాడెనో తోఁచకున్నది. గోషానిషేధకవ్యాసఖండనముండనము పరీక్షించిన నెవరి వ్రాఁత గణ నీయమైనదియుఁ బ్రపంచమే నిర్ణయింపఁగలదు. ఆధారవిరహితము

సాహసమూలము నగు నీయొప్పుకొనకతప్పదను మాటకే యొప్పుకొందునా! మంత్రాలకుఁ జింతకాయలు రాలవు. తాటాకుచప్పుళ్లకుఁ గుండెల్లు బెదరవు. ప్రచండవాయువులకు మణిదీపములాఱిపోవు. ఇది మీరెఱుఁగనిదికాదు. ఒప్పికొనకతప్పదనినటుల మీరు విమర్శించినచో నొప్పికొనియేయుందును. నేనొప్పికొనకపోయినను మధ్యవర్తులగు పండితు లొప్పించియేతీరుదురు. కనుక తాము వ్రాసినయంశములు విమర్శనమున కెంతసేపాగునో విచారించి వ్రాసినయెడలఁ గొంతవఱకు బాగుండెడిది. అట్టియుచితకార్యమునందు మీకే విశ్వాసము లేకపోవ నేనెట్లు బాధ్యుఁడను ?

“ఢిల్లీశ్వరుఁడగు పృథ్వీరాయ చౌహాణునికాలమున హిందువుల యాచారములలో నెట్టిమార్పునుగలిగియుండ లేదనిచరిత్రముఁ జదివినగోషావ్యాసకర్తగారెఱింగిన విషయమేయని మా ఖండనగ్రంథకర్తగారు 4 పుటలో వ్రాసిరి. ఈ విషయము నే నెఱింగినటులు మున్నెన్నఁడుఁ జెప్పికొనియుండ లేదు. నా మతము చరిత్రకారులమతము సదికాదు. ఇట్టిచో శ్రీ భాలేరావుగారు నాపై నీమిథ్యాభిప్రాయగోషము వాటించుటకంటె సాహసము వేఱులేదు. రాజస్థానమునఁ దురకల దాడులు క్రీ॥ శ॥ 650 ప్రాంతములనుండి యారంభమగుటచే హిందువుల యాచారములు నాఁటనుండి దాడులు ముగియువఱకు మార్పునొందుచుండెను. ముఖ్యముగఁ బృథ్వీరాయనికాలమున హిందువుల యాచారములు మాఱలేదనుటకు నే నంగీకరింపఁజాలను. ఈ విషయమై రాణీసంయుక్త యనునాఖ్యాయికనుండి యొక యుత్కృష్టమగుభాగము నుదాహరించుచున్నాఁడను.

“మఱియుఁ బదునొకండవ శతాబ్దమునఁ గలిగిన మ్లేచ్ఛుల యార్భాటముచే జనులందఱు లోకక్రొత్తమార్గముఁ ద్రొక్కుచున్నారు...... గడచిన శతాబ్దమందే మ్లేచ్ఛులపోరుఁ దప్పించుకొనుటకుఁ గొందఱు సంస్కారకర్తలు గ్రామములమీఁదబయలుదేఱి యాహారనాఁడుబిడ్డల కెనిమిదవయేడు రాకమునుపె వివాహముఁ జేయవలయు

ననియుఁ బురుషుఁడు గతించిన స్త్రీని మగనిశరీరముతోడనే దహనముఁ జేయవలయుననియు వారలకు విద్యఁజెప్పించి బహిరంగముగాఁ దిరుగ నీయఁగూడదనియు బోధించుచుండిరి."

ఈ కథాంశము పృథ్వీరాయని కాలములోనిది. ఆఖ్యాయికా కారుఁడు కథాకాలమునకు నూఱేండ్లక్రిందనుండియే హిందువుల యాచారములకు మార్పుగలిగెనని వ్రాయుచున్నాఁడు. నేను విమర్శకులతో నేకీభవింపను. ఇఁక నీయంశ మింతతోముగించి టాడ్ గ్రంథములోనిదని విమర్శకులు పరిచరించిన యభిప్రాయమును బరిశీలించెదను. ఛాందభట్టు రాజసాగ్రంథములో రాణి మలందేవి పరదా చాటుననుండి సలహోయిచ్చెనంతటి యావసరమేలయుండెనో గోషా విరోధక వ్యాసకర్తగారే వివరింతురుగాక యనుటచే నేనే వివరింతును. క్రీ॥శ॥ 650 నుండి ప్రకృతకథాస్థానమగు నుత్తరహిందూస్థానమునఁ దురుష్కులదాడులు విస్తరముగనుండుటచేఁ బృథ్వీరాయనికాలమునకు (అనఁగా క్రీ॥ శ॥ 1000) గోషా వ్యాప్తివహింపలేదని నేను వ్రాయలేదు. పృథ్వీరాయనికాలమునకు హిందువుల యాచారములు మాఱినవనియు మాఱుచున్నవనియు నేను కంఠోక్తిగ శాసించుచున్నాఁడను. పృథ్వీరాయనికాలమునకు గోషాయున్నను లేకున్నను నాయభిప్రాయమున కెట్టిమార్పును లేదు. ఈ ఖండనకర్తగారు నాకన్న ఛాందభట్టు నెన్నోమడుంగు లనుభవజ్ఞానముకలవాఁడని సెలవిచ్చిరి. నాకంటెను గాక విమర్శకులకంటెనుగూడ లక్షరెట్లు గొప్పవాఁడని యనుకొనవలసినదే. విమర్శకులు నేను నేమిలెక్క! యిప్పటిచరిత్రకారులలో నంతవాఁడు లేఁడని వ్రాయఁగలను. కాని యీఖండనలో మాత్రము ఛాందభట్టు వ్రాఁత మావిమర్శకుల కాధారముగా లేదు. తురుష్కులరాకకుఁ బూర్వము హిందూస్త్రీలకు గోషాలేదనియు నిందువేరోలగంబున సింహాసనాసీనులైన పతులకుఁ జేదోడువాదోడుగాఁ జరించుచుండిరనియు నేనువ్రాసితినని మావిమర్శకు లధిక్షేపించిరి. నిజమే వ్రాసితిని. దానికాధారములీవిమర్శమున ననేకములు పొందుపఱతిని. తృప్తి

లేక యభిలషించినవో నింక నుదాహరింపఁగలను. విమర్శమునకు ఛాంధభట్టువ్రాఁత యించుకేని బాధకలిగించునది కాదని ప్రకృతాంశమునుండి విముక్తుఁడనై శ్రీభాలేరావుగా రాధారముగాఁదీసికొనిన కె. వి. లక్ష్మణరావుగారి మహమ్మదీయమహాయుగముఁ విలకింతును.

అల్లాఉద్దీనును మోసగించుటకు రసపుత్రవీరులు సలిపిన మాఱువేసములు చేసినవంచకచేష్టలచే గూడ మావిమర్శకులకుఁ బూర్వముగోషాయున్నటుల స్పష్టమైనదఁట. ప్రకృతకథ క్రీ. శ. 1303 లోనిది. రాజస్థానమున నప్పటికిరమారమి 700 సంవత్సరములునుండి తురుష్కులదాడు లుంటచే హిందువులయాచారముల కప్పటికే మార్పులుజరిగెను. ఆకథాంశము నేనుదాహరించిన రాణీసంయుక్త లోని భాగముచే ధ్రువమైనది. హిందూదేశము తురకలయాధీనమైన దని మావిమర్శకు లొప్పుకొనుచు నప్పటికిఁజత్త్రూరు రాజులలో నాచార వ్యవహారములు మాఱలేదని వాకొనుట నబంధశూన్యముగానున్నది. ఈసందిగ్ధాంశము నాకించుకేనియు బాధకముగాదు. పదకొండవ శతాబ్దమునాఁటి రాయసాగ్రంథాధారము పదమూఁడవశతాబ్దము నాఁటి పద్మినీవృత్తాంతము మావిమర్శకులు తమవ్రాఁతకించుకేనియు నుపకరింపదని గుర్తెఱుంగుదురుగాక.

గోషాగ్రంథమున నేను "ఈయాచారము హిందూమతములో వంశపారంపర్యము కానవచ్చుటలేదు. కాని పద్మనాయకులనఁబడు వెలమదొరలయెడ నిది నేఁటికిఁగానవచ్చుచున్నది" అని రెండవపుటలో వ్రాసితిని. పదునాల్గవపుటలో ఇప్పటికీ (గోషా)యాచారము కమ్మ వారియందును రెడ్డివారియందును వెలమవారియందును గానవచ్చు చున్నదని"యు వ్రాసితిని ఇది పరస్పరవిరుద్ధమని నేనొప్పుకొందును గానిమావిమర్శకులు మాత్రమది కనిపెట్టలేకపోయిరి. పైఁగా ప్రథమాంశమునుమాత్రమే విమర్శించిరి. తప్పుఁగలచోటు కనిపెట్టలేక లేనిచోటులు విమర్శించి ఖండనగ్రంథకర్తగారు మాకు వృథాగ శ్రమఁగల్గించిరి. దీనికై వారివిషయమై యెటు లూహింపవలెనో!

ఉత్తరహిందూస్థానమున గోషాలేని గౌరవ(స్థ)కుటుంబము లేదని రావుగారు వ్రాయించిరి. దీనిని నేనొప్పుకొనక తప్పదు. విమర్శింపక తప్పదు. ఇంతమాత్రమున ఖండనగ్రంథకర్తగారు చంకలు తాటింప నక్కఱలేదు. ఉత్తరహిందూస్థానమున బ్రహ్మకుటుంబము మొదలు గోషాకలదు ఎందువలన? తురుష్కులదాడులకది నూర్గమగుటవలన. తురుష్కులదాడుల బాధలేని ద్రావిడదేశములలో నీయాచారము కనుపింపదు. తురకలపాలనమునకుఁ జెందిన నిజాము రాష్ట్రమున బ్రాహ్మణకుటుంబములలో వారిస్థితిగతుల కనుగుణముగ నేఁటికి గోషాయున్నది. ఆంగ్లేయ రాష్ట్రములలో నున్నఁ దురక లీయాచార మించుకించుక జవదాటుచున్నారు. ఈవిషయము నె శ్రీమతి భండారు అచ్చమాంబగారు వ్రాసిరవి 7 వ పుటలో నుదాహరించియున్నాఁడ. వంగదేశమున గౌరవకుటుంబములలోఁగూడ గోషా వ్యాపించుటకు హేతు విదియేయని యాపిద్యావతి శాసించుచున్నది. దీనినిఁ బట్టియేని భాలేరావుగారు యథార్థము నూహింపరాదా! బ్రహ్మకుటుంబములలో గోషాకలదనుటకు దేవీచౌధురాణి నన్నొకమాఱు చదువుమని విమర్శకు లాజ్ఞాపించిరి. దేవీచౌధురాణికి గోషాయున్నను లేకున్నను గవివంగదేశీయుఁడు కావ్యప్రసను కథాంశము పదునేడవశతాబ్దములోనిది కావునను నాకించుకేనియు బాధకముకాదు గాని వారిమాటలనేల త్రోసివేయవలయుననని మఱల నొకపర్యాయము మూలము పఠించితిని. విమర్శకుల విమర్శజ్ఞాన మేపాటిదో చదువరులకు వెల్లడించుటకే యీగ్రంథముఁ జదివితినిగాని నావాదనకు వ్యతిరేకించునంశము లుండుననికాదు. దేవీచౌధురాణి యని కలవరించుటయేగాని యది రావుగారి మోడిలో నొలికించిన వరాలకుప్పయేమి కలదో పాఠకులకీ క్రిందివిమర్శమువలనఁ దేటకాఁగలదు. తమకాధారములని స్వీకరించిన విమర్శకుల గ్రంథములు నాకాధారములగుట వింతగానున్నది. పరిశీలింపుఁడు. నేను చూచినంతలోఁ దేవీచౌధురాణిలోఁ గథానాయికకు గోషాయున్నటులఁ బొడకట్టలేదు. రానుపోను భాలేరావుగా

రాధారములను గొనుటకు మాత్రము రెండు కుంటియాధారములు పొడకట్టినవి. వారీయాధారములఁగాంచి భ్రమించి నన్ను గెలువఁబ్రయత్నించిరి. ఈసందర్భముల నించుక పరిశీలించుదము. దేవీచౌధురాణి తనభర్తయగు వ్రజేశ్వరునకుఁ గానరాకుండఁ దెఱచాటునుండి భాషించెను. హేతువేమియన సవతియగు సాగరికకు వ్రజేశ్వరునిచేఁ బాదసేవచేయించుటకే.

దేవీచౌధురాణి హరవల్లభునకు లెప్టినెంటు దండనాయకునకు దర్శనమీయదయ్యెను. హరవల్లభుఁడు దేవీచౌధురాణిని గోడలని గుఱుతింపనసియు లెప్టినెంటుదోషిణినిగా భావించి శిక్షించుననియుఁ దలంచియే యిటుల సలిపెను.

దీనిని మావిమర్శకులు చిత్తగించి చౌధురాణినిగోషాబూబును జేసిరి. ఇఁక వీరిఖండనమునకు నేను ముండనమెటులఁ జేయఁగలను! దేవీచౌధురాణి విమర్శకుల పక్షమేకాఁబోలు. పైరెండుసంగతులు దేవీచౌధురాణికి గోషాయున్నటుల మావిమర్శకులకు గాఢవిశ్వాసము కలిగించియుండును. పాపము పూర్వోత్తరసందర్భములఁ బరిశీలింపక గోతిలోని కొరిగిరి.

'సాగరికయు దేవీచౌధురాణియు సపత్నులు. ఊరిలోని యమ్మలక్కలు సాగరికయొద్దచేరి యీసుతోనిట్లు భాషించిరి.

“(దేవీచౌధురాణికి) అదియెట్టిగోషాయోకాని యింటికివచ్చి యిన్నిదినములైనను ఇప్పటికైనను ముసుఁగుఁదీసి మాయెదుటఁ దిరిగి యెఱుఁగదు. (సాగరికా దేవీచౌధురాణికి) నీవయసెక్కడనే నీకురెండంతలు మూఁడంతలుండునే మీయవ్వవయసుండవచ్చు.”

ఈయీర్ష్యాప్రసంగములు ప్రమాణములుగా మావిమర్శకులు తీసికొందురేమో. ఇది నగుబాటని యెఱుఁగరా! సాగరికయు చౌధురాణియు సవయస్కలై యుండఁగా నోరువలేని పేరంటాలు సాగరికతో చౌధురాణి నీకంటె రెండంతలో మూఁడంతలో

పెద్దయనుట యెంతసత్యమో చౌధురాణికి గోషాగలదనుటయుంత సత్యము. పవిత్రాచరణములుగల చౌధురాణిని ఓరువలేనికాంత యెవ్వతెయో ముసలమ్మ యనియు గోషాగల దనియుఁ బరిహసించెను. ఆయమ ముదుసలియుఁగాదు. గోషాకలదియుఁగాదు. ఇవి యీర్ష్యాప్రసంగములు. ప్రపంచమునకిది స్వభావగుణము. ఎవతెయేని రూపవతి త్రోవనుబోవుచున్నఁ దమకంటెరూపవతియని ఎఱింగియు నోరువలేక ముక్కుపై వ్రేలువేసికొని "అన్నియుసరియెగాని యదియేమి రవికమ్మా! నాగరికము మఱిమండిపోవుచున్నదని యొక యమ్మయన నింకొకయమ్మక్క తలయూడించి యింతకంటె చొక్కా వేసికొనరాదా యనును. వేఱొకతె కాలమాహాత్మ్య మిటులున్నది. రవికకాకపోయిన లంగాచూడరాదా! బాజారులూడ్చుచున్నదని వాకొనును. ఇంతలో మొదటియామె యంటుపుఁదీర్చికొని ఔసే ఇఁక బజారులూడ్చుటకుఁ బాకీవాండ్రతో పనిలేనేలేదని వాకొనును. ఈయాక్షేపణలఁగాంచిన యాకాంతలయందీ యోఘువలేనిస్త్రీ లారోపించినదుర్గుణము లున్నటుల భావింప వీలుచిక్కునా! ఈయమ్మలక్కల వాదనములన్నియుఁ బరిగ్రహార్హైకయోగ్యములని మావిమర్శకులు తలంచునంతటి మేధాశాలురు కానఁ బైఁబ్రసంగముచే దేవీచౌధురాణికి గోషాయున్నటు లూహించి వ్రాసిరి. చౌధురాణికి గోషాయున్నటు లింతకంటె నాధారము లాగ్రంథమున బొత్తిగాలేవు. కావున చౌధురాణికి గోషాయున్నది లేనిది విమర్శకులకును బుస్తకముఁజదివియున్న చదువరులకు వదలివేసి చౌధురాణి గోషాపాటింపకుండఁ దిరిగినటు లాగ్రంథములోని యీక్రిందయంశములచే స్థాపించి యాయమకు మా విమర్శకులు కల్పించిన గోషానిర్బంధము తొలఁగించుటకుఁ బ్రయత్నించుచున్నాఁడను.

లెప్టినెంటు దండనాయకునితో దేవీ చౌధురాణి యెట్టి యాచ్ఛాదనము నపేక్షింపక భాషించినటులఁ గలదు.

భాలేరావుగారూ! మీ సెలవుననుసరించి యొక్క పర్యాయము దేవీచౌధురాణి పఠించుటవలనఁ గలిగినలాభమును జూచితిరా? ఏల చేసేత యిట్టిభారములఁ దెచ్చి తలపై వేసికొందురు. దేవీచౌధురాణి నేను చూచియుండననియు గ్రంథనామముచేతనే భయపడుదుననియు మీ రూహించితిరి కాఁబోలును. ఒక్కనితో మాటలాడినంతనే గోషాకుభంగమా యని యనరాదా! ఏలయందురు. గోషాకుఁగల నియమములు మీరెఱుంగనివి కావుగదా! గోషాగల స్త్రీశవముగూడఁ బ్రపంచమునకుఁ గానరాకూడదుకదా! చౌధురాణి గ్రంథమందంతటను గోషా పాటించెనని యున్నదనియే యనుకొనుఁడు (అట్లు లేనే లేదు) ఈ యాధారమువలన నూఱునోములసల్పి యొకటంకుచేసినటులాయెను గోషాశూన్యమై పోయితీఱునుగదా!

దేవీచౌధురాణికి రంగరాజు ఠాకూరు అంతరంగమిత్రులైనట్లును, చౌధురాణి రెండువేలమంది పౌరులతో సభచేసి సభ్యులకు దర్శనమొసంగి ధనరాసులు వారలందఱకు స్వయముగా నిచ్చినటులను 135 పుటవలన స్పష్టముగా బోధపడఁగలదు.

ఇట్టి యాధారములు మీరు విశ్వసించిన యభిమానగ్రంథములనుండి కనవచ్చుచున్నను నేను వ్రేలుమడచి చూపుచున్నను ఖండనగ్రంథకర్తగారూ! మీరు మీవాదము వదలుకొనక యెంతసేపు పోరాడఁగలరు. అయ్యయ్యో! మీ రనుకొనినటులగాక దేవీచౌధురాణి ఒకరికిఁగాక యిరువురకుగాక రెండువేలమందికి గోషాలేకుండఁగాన్పింపఁగా మీరింకను సత్యముమఱచి గోషాపాటించెనని చూరుపట్టుకొని వ్రేలాడుటతగదు. ఒకమాఱు కనుఁగవిప్పి ప్రపంచమునో మాఖండనముండనమునో సవిమర్శముగఁ దిలకింపుఁడు. మిమ్ము మీపరమాప్తులు ప్రేరేప వారిమాటలు త్రోసివేయఁజాలక యెటులో విమర్శము ముగింపనెంచి చౌధురాణి నుదాహరించితిరిగాని సత్యము మిథ్య మీరెఱుంగరా! దేవీచౌధురాణిని ఉత్తగించియు స్త్రీస్వాతంత్ర్య నిరోధమునకు గోషాసంస్థాపనమునకు సాహసించు

చున్నారుగా. ఇంకనైనఁ బద్మనాయకసంఘమునకు మీవ్రాఁతలలోని యసత్యాంశములు మీరే బోధింపనమకట్టుఁడు. ఇది యవశ్య కర్తవ్యము.

బ్రాహ్మకుటుంబములలోఁగూడ గోషాయాచారము కలదనుచు వెంటనే తెప్పపాటులో నింతయేల క్షాత్రముఁగల ప్రతివారును దీని ననుష్ఠించుట యాచారమై యున్నదని మావిమర్శకులు లిఖించిరి. ఇంకనైన వీరిట్టిపరస్పరసందర్భశూన్యఁపు వ్రాఁతముగింతురుగాఁత మని హెచ్చరించుచున్నాఁడను. క్షాత్రమునకు గోషాకు నించుకేనియు సంబంధము లేదు. గోషా తురకలదౌర్జన్యమువలన వచ్చినది. క్షాత్రము రక్తనాళములనుండి ప్రవహించు నొకదివ్యతేజము. క్షాత్రమునకు గోషా చిహ్నముకాఁజాలదు. ఆఁడువాండ్రయుసురు తాఁకునని శంక లేక గోషాపేరుతో తమహృదయమును దామునమ్మఁజాలని రసికశేఖరులు గోషానే యొకక్షాత్రచిహ్నముగా భావించి మురియుచురుకాఁబోలును. "ఇదం బ్రాహ్మ్యమిదం క్షాత్రం శాపాదపిశరాదపి" యను నమోఘ సూక్తిరాజమునకు జీవముపోసి దిగంతవిశ్రాంతకీర్తిఁగాంచిన పరశు రాముఁడు బ్రాహ్మణుఁడుకాఁడా! ఈయనకు క్షాత్రము లేదా! ఈ యనతల్లియగు రేణుకకు గోషాకేదని యేమందమతియు వాకొనఁ గలఁడా! పరశురాముని క్షాత్రము నిరంకుశమయినది ఆయనకుటుంబ మునకు గోషాయనునది బొత్తిగా లేనటుల భాగవతమువలన విస్పష్ట ముగాఁ దెలియఁగలదు. మాభా లేరావుగా రిపుడేని కనులు తెఱచి పరశురామునకు క్షాత్రము లేదుకావుననే గోషా లేదని వాదింప ముం దంజవేయుదు రేమో! ఇంతచక్కనివిమర్శము వ్రాసిన వారిట్టివాదము నకు దిగుదురనుటలో నాశ్చర్యమేమున్నది. "క్షతాత్ త్రాయతే క్షత్రిః" అను వ్యుత్పత్తిచే గాయములవలన (లోకము)రక్షించువాఁడు క్షత్రియుఁడు (రాజు) అతని కర్మ క్షాత్రము. ఈక్షాత్రమునకు గోషాకు నించుకేనియు సంబంధము లేదు. బోడినెత్తినిజూచి సాతానివానిని సాహెబని భ్రమపడినటులఁ బ్రస్తుతపు జమీందారులకె అందుఁ

తురుష్కులతో సంబంధము రాజకీయవిషయములనున్న వారలకె గోషాయుంటచే క్షాత్త్రమునకు గోషాకు లంకెయని విమర్శకులు పిచ్చి వ్రాఁత వ్రాసిరి. ఖడ్గతిక్కన పవిత్రనామము నెఱుంగనివారుండరు. ఈయన క్షాత్త్రములోఁ బరశురామునిఁ దలపించిన మహానుభావుఁడు. రణరంగమున జయమొ చావొ బడయుఁబ్రతిజ్ఞయొనరించి వీరమరణము నొంది సూర్యమండలముఁ జీల్చికొని పరలోకముఁబ్రవేశించి పవిత్ర స్థానము నలంకరించిన మహామహుఁడు. ఇతనిభార్యచానమ్మయుఁ దల్లి పోలమ్మయు గోషాయువతులని యెవరేని సాహసించివాకొని వారల పవిత్రచరిత్రమునకుఁ గళంకము నాపాదింపఁగలరా ! భర్తయనియుఁ దనయుఁడనియు దలంపక యుద్ధమునకుఁ బ్రేరేపి ఖడ్గతిక్కనను రణ భూమికిఁబంపిన యీవీరయువతులు ప్రపంచము నాగరకత నెఱుంగని గోషాబూబులని యేచరిత్రకారుఁడును వాకొనియుండఁడు. ఖడ్గతిక్కనకు వీరవిద్యలో నన్నివిధముల సమానుఁడగు నందూరి కొమ్మనామాత్యుని పవిత్రస్తోత్రమును గుఱించి నేనుప్రత్యేకించి వ్రాయుటమాని మంచనకవికృత కేయూరబాహుచరిత్రమునుండి యొక పద్యరాజము నుదాహరించుచున్నాఁడను.

సీ॥ నెలకట్లవాటునఁ జెలఁగి రెంటెనిమాఱుఁ
గూడ గుఱ్ఱంబులు గుదులు గ్రుచ్చుఁ
బ్రతిమొగంబగు నరపతులకత్తళమునఁ
గడిమిమై వీఁపుల వెడలఁ బొడుచుఁ
బందంపుగోఱియల పగిదినేనుంగుల
ధారశుద్ధిగ నసిధారఁ దునుముఁ
జిదియించుఁ బగిలించుఁ జేతులఁదీఁటవోఁగ
వడిఁగాండమేసి మావతులతలలు
తే॥ గీ॥ తలపుడికి వ్రేసి మావంతుతలలు శత్రు
రాజశిరములఁ ద్రొక్కించు రాఁగె దిరుగ

వాఁగె నుబ్బెడు తనవారువంబుచేత
మహితశౌర్యుండు కొమ్మనామాత్యవరుఁడు ॥

ఈ కొమ్మనామాత్యవర్యుఁడు బ్రాహ్మణుఁడు. క్షాత్రసంపన్నుఁడు. ఇట్టి క్షాత్రసంపన్ను లాకాలమున బ్రాహ్మకుటుంబములలో నసంఖ్యాకులు కలరు. వీరలందఱు గోషాపాటించి యెఱుఁగరు. బ్రాహ్మణాచారములలో గోషా ఒకనియమముఁగ నేధర్మశాస్త్రములయందును జెప్పఁబడి యుండలేదు. క్షాత్రమును మఱచి తురకలకు లోఁబడి స్వరాజ్యము స్వదేశము స్వాభిమానము హిందూరాజు లెపుడు కోలుపోయిరో అప్పుడె స్వకాంతారక్షణమునకుఁ జేతగానిరాజు లాకాలమున గోషాయాచరణమునఁ బెట్టియుందురు. క్షాత్రసంపన్నులకు గోషాతో నేమిపని! తాము చచ్చుటకు నెదటివానిఁ జంపుటకు హిందువు లెంతవఱకు వెనుదగ్గరో యంతవఱకు గోషా యాచరణలోనికి రాలేదు. పైఁ బేర్కొనఁబడిన ఖడ్గతిక్కన కొమ్మనామాత్యుఁడు క్షాత్రసంపన్నులు. వీరికాలమున వీరికుటుంబములకు గోషాలేనటు లనేకగ్రంథములనుండి యాధారములు చూపఁగలను. క్షాత్రమునకు గోషాకు సంబంధమున్నటుల మా భాలేరావుగా రూహించిరి. ఇది పొరపాటు. హిందువుల రక్తనాళములనుండి క్షాత్రవిద్యుత్తు చలనభావముతో నెంతకాలము ప్రసరించునో, అంతవఱకు వారి యాచరణమునకు గోషా వచ్చియుండనే లేదు. పరులదాస్యమునకు క్షాత్రసంపన్ను లెపుడు పాలుపడిరో యపుడె పరులవేషభాషలు పట్టుపడినవి. ఇట్టి విలయావస్థలో సైతము బ్రాహ్మ కుటుంబములోనివారు దురుష్కుల దురాచారమునకు లోనుకాలేదని నాభావము. రాముఁడు క్షాత్రసంపన్నుఁడే. ఆయన తన రాణికి గోషాపాటించెనా! వేదయుగమున బ్రాహ్మ్యమునకు క్షాత్రము లేదా! ఆకాలమున రాణివాసమే లేనటుల శ్రీలక్ష్మణరావుగారు వ్రాసియుండలేదా! ఇంతయేల. క్షాత్రమునకు గోషాకుసంబంధము లేదు. క్షాత్రము మనకు (హైందవ్యులకు) వంశపరంపరాగతమగు సహజధర్మము. గోషా తురుష్కపరిపాలనా

గతమగు దురాచారధర్మము. విరోధులఁ గారాగారములలో బంధించు టకుమాఱు క్షాత్రము నశించిన కాలములోనె యువతుల గోషాయను కారాగారముల బంధించు నాచారము హిందువుల కేర్పడినది. కావున క్షాత్రము నశించుటయు గోషాప్రబలుటయు నొక్కమాఱె. ఈరెంటి కున్న సంబంధ మింతియేయని భాలేరావుగారికిఁ బాఠకమహాశయుల సమక్షమునఁ దెలియఁజేయుచున్నాఁడను.

పద్మనాయకకులకాంతయగు నైతమ్మకు గోషా లేదనుచు నీమహమ్మదీయాచారము పద్మనాయక కాంతలకు లేనటుల శ్రీనాథమహాకవి వీరచరిత్రమునుండి నేను గొన్ని కథాంశము లుదాహరించితిని. దీనిని మా భాలేరావుగారు కటుచిత్రముగా విమర్శించిరి. వీరచరిత్రము శ్రీనాథవిరచితముకాదని రామలింగారెడ్డిగారు వీరభద్రరావుగారు వ్రాసిరని మావిమర్శకులు విశ్వసించిరి. శ్రీనాథుఁడు వ్రాసిననేమి! మఱియొకకవి వ్రాసిననేమి! కథాంశము యథార్థమైనది. చరిత్రము నిశ్చయమైనది. కథాకల్పనములు విషయపరిత్యాగములు నీగ్రంథమున లేవు. గ్రంథాదియందును గ్రంథాంతమందును శ్రీనాథకవి వ్రాసినటులేకలదు. ఎవరో వ్రాసి శ్రీనాథకవిపేరఁబెట్టరాదా! యని మావిమర్శకులు వాదింతురేమో. ఎవరో గ్రంథములువ్రాసి యెవరి పేరనో పెట్టునంతటి యవకాశమేల తటస్థించును. వీరచరిత్రకర్త శ్రీనాథుఁడు కాఁడని మనమంగీకరించినను వ్రాసినమహాకవిమాత్రము శ్రీనాథుని సమకాలమువాఁడై యుండవలెను. ఏసంబంధము లేకున్న శ్రీనాథునిపైఁ గర్తృత్వమేల యారోపించును. శ్రీనాథుఁడు వీరచరిత్రము రచించియుండఁడనియు వీరకవిరచించెననియు శ్రీరామలింగారెడ్డిగారు ఈక్రిందవిధముగా వ్రాసియున్నారు. విమర్శకులుచక్కఁగ గమనింపఁ బ్రార్థితులు.

ఈవీరచరిత్రము కొన్ని ముఖ్యాంశములలో రామాయణభారతాదులకు నీడైనదని నాయభిప్రాయము. పాండిత్యప్రభావము మిక్కిలియుఁదక్కువ. హృదయముల నల్లలనాడించు భావనాశక్తియో

యెక్కువ. శ్రీనాథునిలోఁ బాండిత్యమునకు సమమైన కవితాశక్తి లేదు. పల్నాటివీరచరిత్రములోఁ గవితాశక్తికి సమమైన పాండిత్యము లేదు.

ఈయాధారముచే వీరచరిత్రమును శ్రీనాథకవి రచింపకపోయినను శ్రీనాథుని భావనాశక్తిలోమించిన వాఁడే వ్రాసినాఁడని రామలింగారెడ్డిగారి వాదన. దీనిని నేనామోదించుచున్నాఁడను. వీరచరిత్రకారుఁడు మిగులపూర్వకవి. ఈయనగ్రంథ మామూలాగ్రము గ్రంథస్థముగాక ముఖస్థమై పలుమారి వాగ్విధేయముగానుండుటయె యిందులకాధారము. వీరచరిత్రకవి ప్రపంచానుభవము నందును యథార్థకథాలేఖనాచారము నందును సత్యవిషయసంస్థాపనమందును బ్రావీణ్యముకలవాఁడు. వీరచరిత్రమున యుద్ధవిషయములు రాయబారములు దేవాలయములు యుద్ధస్థలములు మార్గములు ఆకాలపు వేషభాషలు ఆ యుధస్వరూపములు చక్కఁగఁబ్రశంసింపఁబడియున్నవి. తదంశములయందించుకేనియుఁ గల్పనము అసత్యము లేదు. శ్రీనాథకవి కృతముగాదుగాననో రచయిత సామాన్యకవి యగుటచేతనో దీనిలో గొన్ని భాషాదోషములున్ననాఁట సత్యమే. దానిని కంగీకరింతును. మనకీగ్రంథమునఁ గావలసినది కవిత్వపటుత్వము భాషాపరిజ్ఞానము కాదుగదా! ఆకాలపుఁజరిత్రము అప్పటివిషయము సమగ్రముగాఁ గావలసినది. వీరచరిత్రకారుఁడు ప్రకృత పలనాటి వీరుల యుద్ధకథాస్థానమగు పలనాటిసీమలోనివాఁడని యాతని యుద్ధస్థలనిర్ణయము ఆలయములవర్ణనము అచ్చటినదులయొక్కయు గ్రామములయొక్కయుఁ గొండలయొక్కయుఁ బ్రదేశములయొక్కయు స్వరూపకథనము సాక్ష్యమగుచున్నది. అనుభవజ్ఞానముఁగల కవి వ్రాసిన గ్రంథమగుటచేతను గ్రంథాంశము యథార్థచరిత్రగర్భితమగుటచేతను పద్మనాయకుల పూర్వచరిత్రముదీనివలనఁగాక మఱియేగ్రంథమువలనను దెలియమిచేతను నేను వీరచరిత్రము గోపావిషయమున నాధారముగా స్వీకరించితిని. గ్రంథమెవరురచించిన నొక్కటియెయని భావేరావుగారికి విన్నవించుచున్నాఁడను. ఈవీరచరిత్రమున వ్యాకరణస్ఖాలిత్యములున్న

మాత్రమున విషయనిరూపణమునకు నాకీగ్రంథము ప్రమాణమైనది కాకపోదు. కావుననే విమర్శకులిందలి యంశముల నిష్టమువచ్చినటుల విమర్శించిరి. ఈగ్రంథమెవ్వరు వ్రాసినను వీరకవియెవ్వరైనను మావిమర్శకులకంటె ననుభవజ్ఞానముఁగలవాఁడును బద్మనాయకుల యాచారములు చక్కఁగా నెఱింగినవాఁడును నగుటను నేను ఘంటానాదముగ వాకొనుచున్నాఁడను. మాభాలేరావుగారివిమర్శగ్రంథమున వ్యాకరణ దోషములు వేలకు వేలు లేవా! అట్లని నేను ప్రత్యుత్తరము వ్రాయుటకుఁ బ్రాలుమాలితినా! నాకు వీరచరిత్రమునందును విమర్శగ్రంథమునందును ముఖ్యముగాఁ గావలసినది విషయమే. వీరకవి కవితావిషయమున నేస్వల్పస్థానముఁబడసినను జరిత్రవిషయమున నున్నతస్థానముఁ బడయఁదగినవాఁడే. కావున నాఖండనగ్రంథకర్తగారు నేను చూపిన వీరచరిత్రములోని యుదాహరణముల నన్నింటిని సమర్థించినది. వీరచరిత్రమునుండి నేను.

"మొదలఁ రప్పించిన ముఖ్యులైనట్టి
యోజ్జలు తనమ్రోలనుండంగఁజూచి
బొంగంబులు చేయఁగోసఁగును మీకుఁ
బైఁడియిప్పించెదఁ బట్టనయంత.....
పసిముల్లులీసుక వడిరమ్మటన్న
పసిముట్లుకొనివచ్చి భామకన్నెదుర
భక్తితో నిలచిరి పటిమదీపింప
నైతమ్మ సెలవిచ్చె నంతటవారు". 42 వ పుట.

ఈకథాభాగము నుదాహరించి యిట్లు చర్చించిరి. "పై పదములను జూచి పూర్వ*మైతమ్మకు గోషాకలదన సాహసించువారుందురా! అయినను మావ్యతిరేకి వాదములు "ఒజ్జలు తన

* ఈమైతమ్మ పద్మనాయక కులాలంకారుఁడగు బ్రహ్మనాయని ధర్మపత్ని. బ్రహ్మనాయఁడు దైవసదృశుఁడని గ్రంథమునఁ బ్రశంసింపఁబడియున్నాఁడు.

ప్రేమాలనుండంగఁజూచి" యనుటలోని ఒజ్జలుఅను శబ్దమును గ్రహించి గురుభావముంచి మైతమ్మ సాన్నారులకు దర్శనమిచ్చుటవలన నాయమ గోషాకు భంగమురాకుండునందు రేమో అలాగైన (సాన్నారులు) "భక్తితోనిల్చిరి పటిమదీపింప" అనుపంక్తిలోఁజూపిన మైతమ్మాదులాఁది భక్తి మాకాధారముకాదా?" అని నేనుపైచరిత్రాంశమును విమర్శించి మాప్రతిపక్షులకు సందేయిందు లేదని ముందుముందు తెలుపుటచేఁ బాపము బాలేరావుగారు క్రొత్తత్రోవఁ ద్రొక్కిరి. ఆత్రోవనుగూడ గమ్యస్థానముఁ జేరలేకపోయిరి. మావిమర్శకు లీసందర్భమున సలిపినయకాండతాండవము పాఠకులారా! మీరేసత్యకాములై మధ్యవర్తులై విలోకింపుఁడు.

"బొంగరములు చేయుటయందు ఒజ్జలనఁగా నిపుణులని భావము బాలురయ్యు నాయాకార్యములలో నిపుణులుగా నుండ వచ్చును. అట్టినిపుణులగు బాలురు కార్యములసట్ల అంతఃపురములో స్త్రీలయుండఱ నగుపడి పనులుచేయుట యిప్పటికిని సంస్థానములలో వాడుక కలదు". గోషావ్యాసఖండము.

ఒజ్జలనఁగా బొంగరములుచేయుటయందు నిపుణులనిభావమఁట. ఈశబ్దస్వరూపకల్పనమున వాగనుశాసనబిరుదము నహింపఁగలదు. ఒజ్జలు అనుశబ్దము పాధ్యాయశబ్దభవము. ఇదియే సాన్నారులకు జాతివాచకమున వీరచరిత్రప్రణీత వ్రాసియున్నాఁడు. ఈశబ్దమునకుఁ దమకనుగుణమగు భావమును అర్థమును గల్పించుకొనినారలు. పూర్వకవులందరు ఒజ్జలు అనుట కుపాధ్యాయుఁడనియే యర్థమును సాధించిరి. మావిమర్శకులకు నిపుణులనియర్థ మెటులసాధ్యమయ్యెనో! ఆనిపుణత బొంగరములుచేయుటయందని యెటులఁగోఁచెనో శబ్దజ్ఞానముఁ గలవాని కాశ్చర్యము కాకపోదు. బొంగరములుచేయుటయందు నొజ్జలనిన యెటులోసాధించి నిపుణులని యర్థముచెప్పవచ్చును. ప్రత్యేకము జాతివాచకముగఁ బ్రయోగింపఁబడిన ఒజ్జలు అనుపదమునకు ముందు బొంగరములచేయుటయందే యొజ్జతికముకలదని భావము కవియెందేసి

వ్యవహరించియున్న యెడఁ దలంపవచ్చుఁగాని ప్రస్తుతాంశము తమ వాదమునకు బాధకమని మార్చుట యెంతయుసాహసము. విమర్శమున కిది మిక్కిలి చెడుత్రోవ. పలనాటివీరచరిత్రము శ్రీనాథకృతము గాదనిన వారంతతోనూరుకొనక గంభీరము వహింపక శబ్దములకు వ్యర్థభావములుగడించి నాయాధారముల విమర్శము చేయుట నాయా ధారములు గణనీయములని యొప్పుకొనుటయే. లిఖితరూపమున వీరచరిత్రాధారముల భాలేరావుగా రంగీకరింపకపోయినను అభిప్రాయరూపమున నంగీకరించినటుల స్పష్టపడి చాలనేపయినది. ఒజ్జలు పదమునకుఁ బూర్వకవులు సాధించిన పరమయోగివిలాసములోని యర్థమును బాఠకులారా! చిత్తగింపుఁడు.

క॥ వరుస నుదాత్తప్రముఖ
స్వరములు కనుబొమ్మసంజ్ఞజాలక యుండన్
బొరిపొరి గఱపుచు వటువుల
నురుధృతిఁ జదివించుచున్న నొజ్జలకడకున్॥

ఈ పద్యమున నొజ్జలన నుపాధ్యాయులనియే యర్థము స్పష్టమగుచున్నది. ఇందు నిపుణులనిగాని బొంగరములు చేయుటయందే యానిపుణతయనిగాని ఆనిపుణతఁగలవారు బాలురనిగాని యూహింప నవకాశ మణుమాత్రమైనకలదా? మా భాలేరావుగా రిట్టిసందర్భము లేని శబ్దమునకే యపరూపార్థములు బ్రతిపాదించిరి.

సీ॥ రాజునొజ్జల మంత్రరక్షాబలంబున

రాఁబొందుపడదయ్యె రాక్షసునకు

నైషధము చతుర్థాశ్వాసము.

ఇచ్చటను ఒజ్జలన నుపాధ్యాయులనియే యర్థము. కొన్ని చోటుల నొజ్జలన యాజకులని యర్థముకలదు. ఈయర్థముతో భారతాదిపర్వమునఁ బ్రయోగమున్నది. బొంగరములు చేయుటలో నిపుణులగు బాలురని మాభాలేరావుగా రీశబ్దమున కర్థమూహింప నవ

కాశము లేదు. "మొదలరప్పించిన ముఖ్యులైనట్టి యొజ్జల" అనుద్విపద భాగమునకు నొజ్జలన బొంగరములు జేయుటలో నిపుణులనునర్థము రాకున్నను వచ్చుననుకొనిన "ముఖ్యుల"ను దాని కేమియర్థముఁ జెప్ప వలయును? "పిమ్మట నొజ్జలఁ బ్రియముకోఁ జూచి"అనియు వీరచరిత్రమున నొజ్జలనుపదము సాన్నారులపట్లనే వ్యవహరింపఁబడియున్నది. ఐతమ్మకు ఒజ్జలకు మధ్యకాండపటము (పరదా) లుండరాదాయని మా భాలేశాస్త్రుగారువిమర్శింపకశబ్దమునకె వ్యతిరేకార్థము సాధింపఁ బాటుపడిరి. పలనాటివీరులకాలమున సాన్నారులు గౌరవనీయులై యుండిరని మాచర్లశాసనమువలనను ఆంధ్రులచరిత్రము రెండవ భాగమువలనను వెల్లడియగుచున్నది. ఒజ్జలనునది వయసుదీఱివిద్యల నాఱితేఱిన స్వర్ణకారులపట్లనే వర్తించుననుగాన మావిమర్శకుల శబ్దసృష్టి యిచ్చటపొసఁగదు. వీరభాగవతమను పద్యకావ్యమున వీరభద్రకవిచేఁ బ్రకృతసందర్భమున వ్రాయఁబడిన.

కం॥ అనిపలుకు బాలచంద్రుని
వినయవచోగరిమకలరి వితతామోదం
బున శిల్పివర్యులన్ రాఁ
బనిచి మనోభీష్టగతుల బహుమతులొసఁగెన్॥

వ॥ ఇట్లు బహూకరించి మైతాంబవారలకిట్లనియె.

ఉ॥ సంగడికాండ్రుఁదాఁగలసి సంతసమొప్ప గృహాంగణంబునన్
బొంగరమాడఁగోరె నలవోకకుగా మనపిల్లవానికా
బొంగరముల్ రచింపుఁడి యపూర్వచమత్కృతికల్పనాకళా
లింగతచిత్రసంపద దలిర్పఁగఁ జూచెద మీసమర్థతన్॥

ఈపద్యములవలన శిల్పులు బాలురనితోఁచుట లేదు. ఐతమ్మ బాలచంద్రునే పిల్లవాఁడని వాకొనెఁగాని శిల్పులనటుల సంబోధింప లేదు. అంతియగాక శిల్పివర్యులను విశేషణయుక్తవిశేష్యముకూడ శిల్పులుబాలురుగారను సంశయము దృఢమొనరింపుచున్నది. ఇదియుం

తయుఁ దుంగలోఁదొ్రిక్కి శిల్పులుపిల్లవాం్రడనియు ఒజ్జలనిన నర్థము వేఱనియు నంతఃపురములలో శిల్పులగుఁ గుఱ్ఱవాండు్రి తిరుగుటలాచ రణమేయనియు మావిమర్శకులు మృషావాదనములాచరింపఁ దడయ రైరి. వచ్చినసొన్నారి యొకఁడుకాఁడు పలువురు. వీరు గ్రామమున నున్నవారిలో ముఖ్యులు. వీరందఱు పిల్లవాం్రడేయనుటకుసాహసించు వారి కనృతమనిన భీతియేయుండదు. ఇట్టి సత్యదూరములగు్రవాఁతలఁ నా్రశయించిన లోకము నవ్వునని యేని మాభాలేరావుగా రూహాచేయ రైరి. భాలేరావుగారు ఐతమ్మ గోషాస్త్రీయని నిరూపించుటకుఁబడిన శ్రిమ వర్ణనాతీతము. ఆప్రియాసమంతయు వృథాయైనందులకు నాకువిచారముగనున్నది. ఈవిషయ మెక్కుడు్రవాయఁ బనిలేదు. ఐతమ్మ సొన్నారులకు దర్శనమొసంగుట నిశ్చయము. వాండ్రుబాలురు కానిమాట నిశ్చయము. ఒజ్జలనుపదమునకు భాలేరావుగారు సాధించిన విమర్శము దోషమగుట నిశ్చయమె. కావున నీయంశము నింకముగించి ఐతమ్మయెక్కిన యందలములు విచారించుదము. అయితమ్మ తన తనయుని యత్తవారింటికి సాటివెలమస్త్రీలతో నెక్కిపోయినయందల ముభయపార్శ్వముల మరుగులేనిదనియు నాకారణమున నైతమ్మకు గోషా లేదనియు నేను పూర్వవ్యాసమున సవిమర్శముగా వ్రాసియు న్నాఁడను. అందలము=పార్శ్వముల మరుగులేనిపల్లకి యని శబ్దరత్నా కరమున నర్థముకలదని తెలిపితిని. దానిని మావిమర్శకు లీవిధమునవిమ ర్శించియున్నారు.

"...........అయితమ్మాదు లందలములెక్కి వెళ్లిరనుచోట బురకా మొదలగు నాచ్ఛాదనలతో గోషాకుపయోగమగు నందలము నెక్కి వెళ్లిరనియూహింపనగునుగాని వానకునాని యెండకువాడుచు బ్రిహ్మనాయునియంత వాని ధర్మపత్నియైన నైతమ్మయును తోడిసుకు మారస్త్రీలును గోషారహితమగునందలము లెక్కివెళ్ళిరని యీవ్యాస కర్తగా రెటులూహించిరో నాకించుకైన బోధపడకున్నది. పూర్వము గోషాకనుగుణమగు పల్లకీలుండెనని.........పద్మినీ చరిత్రమువలన

వృథవడి యొడెని. ఈవ్యాసకర్తగారు తిరుమల వెళ్ళ లేదు కాఁబోలు. వెళ్ళినచో నచ్చటి గోషా కుపకరించు నందలము లెన్నియో చూడఁ గలరు."

ఇవి మావిమర్శకుల వ్రాఁతలు. ఈవ్రాఁతలకుఁ దలలుతోఁకలు సందర్భములు లేవు. ఎంతవిమర్శించినను తనివి దీఱుట లేదు. పాఠకులారా! చెవియొగ్గి వినుఁడు. ఈభాలేరావుగారి వ్రాఁత నిరాధారమో ఆధారవంతమో తేల్చవలసినది మీరే. వీరచరిత్రమున నెచ్చటనేని గోషా నైతమ్మపాటించినటుల ఖండనగ్రంథకర్తగా రాధారముఁజూపి యామెయెక్కినయందలము గోషాకుపకరించునది యని వ్రాసినచో నేను శిరసావహింపక తప్పదు. అటులఁగాక వీరచరిత్రము సర్వము వెలమవారింగుఱించి చెప్పనదియైననుఐతమ్మ, శీలమ్మ, రేఖాంబ, మాంచాల, లోనగు వెలమస్త్రీలకు గోషాయంతకున్నను పెక్కుసందర్భములలోఁ జెప్పఁబడకయుంటచే నైతమ్మ గోషాలేశము లేని సాధ్వియనిన లోపమించుకేనికలదా! ఐతమ్మయొనరించిన వ్రతములు నియమములు పుత్రార్థినియై సల్పిన పూజలు చూడ నాయమకు గోషాలేనటులఁ దెలిసినది. సొన్నారులకు దర్శనమొసంగి వారలతో స్వేచ్ఛగ వ్యవహారమొనరించెను. ఇట్టితఱి నీయమకు గోషాయున్నటులేల తలంపవలయును? భోజనముచేయుసమయమున సైంధవముఁ దెమ్మనిన గుఱ్ఱముఁదెచ్చుటయెటు లసంగతమో ఐతమ్మ గోషా పాటింపలేదని ముందుఁగవి తెల్పఁ బిదపనందలమెక్కినదనిన బురకామొదలగు తురుష్కయువతీచిహ్నములు ధరించెనని యూహించుటయు నటులెయసంగతము. వీరచరిత్రకారుఁడా కాలఁపుస్థితిగతులు రాజసభల తీఱులు రాజనీతిరీతి యుద్ధప్రయాణములు మజిలీలు చరిత్రకు భిన్నములేకుండఁ జెప్పినాఁడు. వెలమవారలయాచారములు యథార్థముగ యథారూపముగ వర్ణించియున్నాఁడు. ఇట్టికవివలంనుఁడు పద్మనాయకకాంతలకు గోషాయున్న నొకచోటఁగాకున్న మఱియొకచోటనేని వ్రాయకుండునా? పూర్వపద్మనాయకాచారములకులత్య

గ్రంథమనఁదగు వీరచరిత్రమున లేని యాచారముల నున్నటుల లోకము కనులుమూసి వ్రాయఁదలంచుటకంటె సాహసము వేఱు లేదు.

ఐతమ్మయొద్దకు వచ్చినవారు ముఖ్యులగునోజ్జలు. అనఁగాఁ బని పాటలయందు మెలకువఁగల శిల్పులని కవిహృదయము. సాధారణముగ శిల్పవిద్యాపరిచయము పూర్తిగాఁగడించువఱకుఁ బదునెనిమిదేడు లేని పురుషులకుఁబట్టును. ఐతమ్మచెంతకు వచ్చినది ముఖ్యులగుశిల్పులు కదా! ఒక్కరుకాదు. పలువురుశిల్పులైతమ్మయెదుట ("కన్నెమర")బొంగరములు చేయఁబ్రారంభించిరి. వీరందఱు బాలురని మావిమర్శకులతలంపు. సర్వస్థలములలోను గోషానాచరించుసతులయొద్దకుఁ బదియేండ్లుదాఁటినవాండ్రు పోవవీలుండదు. బొంగరములు చేయుటకు వచ్చినవారందఱు పదియేండ్లవాండ్రేయనిన నావయస్సునకు శిల్పులలో ముఖ్యులైయుండిరనుట ప్రకృతివిరుద్ధము. శిల్పులు ప్రాయముమించినవారలనిన గోషాకు విరుద్ధము. ఈయుభయసందర్భములలోఁ బ్రకృతివిరుద్ధమును త్యజించిగోషాకువిరుద్ధమగునంశమునే నేను ప్రమాణముగాస్వీకరించుచున్నాఁడను. ఏలయనననైతమ్మగోషా లేనిసతియగుటవలన. గోషాకాంతలు శిల్పవిద్యాధురీణులకు దర్శనమొసంగుట వాండ్రతో స్వయముగా వ్యవహారమొనరించుట యథార్థమునకు దూరము. పెక్కులేల? వీరచరిత్రకారుఁడు వచించినబజ్జలు బాలురుకారు. ఆవిషయము కథాభాగము జాగరూకతతో గమనించినస్పష్టము కాఁగలదు. ఐతమ్మకొఱకునూతనముగాసృష్టింపఁబడి గోషాకు భంగముకలిగింపఁజాలని వయస్సులోనున్న శిల్పులు పలువురు బ్రహ్మనాయనికాలముననుండిరనియు వారే నైతమ్మగోషాకాపాడి శిల్పకార్యక్రమములు నిర్వర్తించిరనియు నేమంద మఱియుఁ దలంపలేఁడు. అందలము లెక్కనచో నెండకెండివావకునాను దురఁట. ఏమి! మాటలతేటలు రానురాను వృద్ధియగుచున్నవే. తమ్మ విమర్శము వ్రాయఁ బ్రేరేపణ మొనరించువారు సంతోషించుటకుఁ బలుకు చిలుక పలుకులు కాఁబోలును. మా విమర్శకుల ఖండనగ్రంథమున నసందర్భములు

వెక్కులుండఁ బ్రథమమున నిటులున్నను రానురానేని బాగుండక పోవునా యని తలంచితిని. కాని తఱచినకొలఁది పోయినకొలఁది యసంగతప్రసంగము లభ్యుదయపరంపరాభివృద్ధిగా నున్నవి. విమర్శ గ్రంథకర్తగారు "చదువకముందు వరావరాయని చదివిన పిమ్మట వడావడా"యనిన మేథాశాలికథను జ్ఞాపకమునకుఁ దెచ్చుచున్నారలు. ఇంతవఱకుఁ జర్చింపఁబడినయంశముల పరమార్థమును విమర్శకులకుఁ దెలుపఁ బాఠకులవేఁడికొనుచు నీఁకఖండనగ్రంథకర్తగారినే సంబోధించుచున్నాఁడను. ఖండనగ్రంథకర్తగారూ! అయ్యయ్యో! అందలము లెక్కినచో నెండకునెండి వానకునానుదురా? అదియేమియన్యాయము. పైనాచ్ఛాదనము లేదని నేనువ్రాసితినా! ఇరుపార్శ్వముల మరుఁగు లేనిపల్లకియంటినిగాని. ఐతమ్మ మొదలగువారు వెళ్ళినది గ్రామాంతరమని మీరుతలంచి పద్మనాయకస్త్రీలు "వానకునాని యెండకెండుదురే యందలములలో నేల ప్రయాణమొనరించిరి." అని వ్రాసియుందురు. ఐతమ్మనివాసగ్రామము తనయుని యత్తవారి గ్రామము మేడపియే. అందువలన నొకవీధినుండి మఱియొకవీధికేగుట కందలము లెక్కిరి. దీర్ఘప్రయాణమేయైన (గోషాకొఱకుగాదు) ఎండకొఱ కాచ్ఛాదనమున్న యందలమొ శకటమొ యెక్కియేయుందురు. ఇప్పటికి మీసందేహము తీఱియుండును. "సుకుమారస్త్రీలు గోషారహితమగు నందలము లెక్కుట'' మీర లధిక్షేపించుచున్నారలు. క్రమముగ మీరు గోషా లేనిస్త్రీలను నిరసించుచున్నట్లులున్నది. ఉన్నది యననేల నిరసించితిరి. దూషించితిరి. లేనినిందలనెత్తిపైఁగట్టితిరి. ఆయంశము ముందువిమర్శింతును. సుకుమారస్త్రీలకు గోషాయుండి తీఱవలయునాయేమి! అటుల నెక్కడనేని బూకాధారములు చిక్కెనా! లేక గోషాదురాచారములేని స్త్రీలలో సుకుమారస్త్రీలులేరనియా మీవ్రాఁతల కర్థమే లేదు. పద్మినిచరిత్రమువలన గోషాకుపకరించునందలములున్నటుల మీకు దృఢపడునుగాక. అది మాకుబాధకముకాదు. రాజపుత్రస్థానమున నప్పటికి గోషాపూర్ణ

ముగాఁ బ్రబలినది. పద్మిని క్రీ॥ శ॥ పదమూఁడవ శతాబ్దములో నిదిగాన నప్పటికిఁ బ్రయాణములకు ''గోషా''కుపకరించు నందలములు సృష్టి కావలసివచ్చెను ఆయందలము లుత్తరహిందూస్థానమునకుఁ జెందినవియెగాని మనకు సంబంధించినవి కావు. పలనాటివీరులయుద్ధము పదునొకండవశతాబ్దాంతమున జరిగియుండుటచేతను. ఆనాఁటికి దక్షిణ హిందూస్థానమున ముఖ్యముగా నాంధ్రదేశమున తురుష్కులదాడులు దౌర్జన్యములు దౌష్ట్యములు విశేషించి లేవుగానను బ్రహ్మనాయక కులజాతయగు నైతమ్మకు సాటివెలమస్త్రీలకు గోషాతోఁబనిలేక పోయినది. పదమూఁడవశతాబ్దమునఁ బ్రతాపరుద్రచక్రవర్తి తురక లచేఁ బట్టువడుట మొదలుకొని తురకలదాడు లాంధ్రదేశమున బాహా టముగ నేర్పడినవి. అప్పటినుండియే గోషాదురాచారము వ్యాపించినది. ఇందులకు నిదర్శనముగఁ గాకతీయచక్రవర్తినియగు రుద్రమదేవి గోషాపాటింపమియు నైతమ్మ మొదలగువారు గోషాపాటింపమియుఁ జేకొనవచ్చును. ఇంతయేల! మనపూర్వులు చరిత్రము లే వ్రాసియున్న యెడల "గోషా" పదమూఁడవశతాబ్దమునుండియే ప్రతాపరుద్రచక్రవర్తి కారాగృహవాసకాలమునుండియే తురుష్కు లాంధ్రదేశమున సంపూర్ణముగ గెలువఁబడసిన మొదటివాడినుండియే ప్రబలినదన మనకు దృష్టముగా వెలుఁజిక్కునది. ఇపుడీయంశ మాధారములచే స్థిరపడినది. తిరుమలలో గోషాకుపయోగించు నందలములుండుఁగాక. అవి యాంధ్రదేశమున గోషాలేనికాలమున పదమూఁడవశతాబ్దము నకుఁబూర్వమున నున్నవని మావిమర్శకులు వాకొనఁగలరా! ఆంధ్ర దేశమున గోషాయేనాఁడు ప్రబలెనో అప్పుఁడే "గోషా" అందలములు బయలుదేరినవి. నే నుదాహరించిన యందలములు పదునొకండవ శతాబ్దములోనివి. కర్నూలు మండలములోని మార్కాపురము తాలూకాలో వాడుకలోనున్నయవి. ఆకాలమున బ్రహ్మనాయఁడు సకుటుంబముగా మార్కాపురము ప్రాంతములకు వలసఁబోయి మేడపిలో వసించెను. అచ్చటనున్న యందలములు నేఁటివఱకు గోషా

కుపయోగింపనిస్థితిలోనివిగనె యున్నటుల స్పష్టముగాఁ దెలియుచున్నది. మీరటకేగి యవి చిత్తగించినచో నావ్రాఁత యెంతసత్యబద్ధమైన దియు మీకుఁ దెలియఁగలదు. మీదృష్టి నొకపర్యాయ మాంధ్రదేశ ముపైకి దేశచరిత్రముపైకిఁ బోనిచ్చి పిమ్మట విమర్శములోనికిఁ దెండు. అప్పుడు మీకు సత్యాంశములు స్ఫురింపఁగలవు. గోషా మనదేశమున నించుకయేని లేనికాలమునఁ బ్రబలిన యందలములు (ఆందోళికలు) సర్వము నుభయపార్శ్వముల మఱుఁగులు లేనివియే. మీకాయంశము గావలసియున్న మనపురాణములన్నియు సాహాయ్యముకాఁగలవు. అయితమ్మ మొదలగువారికి గోషా లేదని యెటులూహించితినో సవిస్త రముగ ఆధారసహితముగ విన్నవించితిని. మీరిఁకముందు నాకించు కయిన బోధపడకున్నదని వ్రాయ సాహసింపనియంత విరళముగా నాయభిప్రాయము ఊహ వెల్లడించితిని.

పాఠకులారా! మావిమర్శకుల వ్రాఁత నేర్పు నించుక పరిశీలింపుఁడు. “గోషాపద మన్యదేశీయమనియు నేభాషలో నీపదముకలదో ఆభాష మాటలాడువారినుండి యీపదము నాయాచారము మనకు వచ్చిన దని ఖండనన్యాసకర్తగారు నుడువుచున్నారు.” అని విమర్శకులు వ్రాసిరి. గోషాయాచారములు విపులముగ నొకచోట వ్రాసియు న్నాఁడఁ గాన నిట్టియాచారములు రామాయణభాగవతభారతాది పురాణగ్రంథనాయికల కున్నటుల నాకాలఁపుఁగవీశ్వరులు చెప్పలే దనియుఁ బురాణనాయికలు (క్షత్రియకాంతలు) పాటించిన యాచా రము తద్భిన్నమగు రాణివాసమనియు నిర్ణయించుచుఁ దుదకు గోషా యర్థమునుబోధించు పదము మనభాషలో లేదనియుఁ బురాతనగ్రంథ ములలో నిట్టియాచారము ప్రశంసింపఁబడియుండలేదనియు నేను నొక్కివక్కాణించితిని. ఈదురాచార మిప్పటికిఁ దురుష్కులదాపు లకు నెక్కుడుసంబంధించిన యుత్తరహిందూస్థానమునందును దురుష్క పాలనకు సంబంధించిన హిందూకుటుంబములయందును మాత్రమే కాన్పించుచున్నది. ఇందులకుఁ బెక్కులు గ్రంథాధారములఁ జూపి

తిని. ఈయాచారము తురుష్కులదేయని నిర్ణయించి వారివలన మనకు సంక్రమించిన కారణము సాకల్యముగ గ్రంథములనుండి చూపితిని. ఇన్నింటినిజూచి మావిమర్శకులు గోషామనకుఁ బూర్వము నుండి యున్నదని సందర్భములు లేని యంశములతో వాదించుట మిగుల నేహ్యముగానున్నది. పైఁజేర్కొనఁబడిన యాధారములతోఁ జర్చింపఁబడిన యీయంశము మావిమర్శకులు విశ్వసింపకతగిన ప్రత్యుత్తరమొసంగక నేను గోషాశబ్దమన్యదేశీయమగుట నాచారముగూడ నన్యదేశీయమని వాకొంటినని నిరాధారమని పరిహసింప సాహసించుట యుక్తముగ లేదు. మఱియు మావిమర్శకులు "గోషాపదము తురుష్క ప్రభువులకాలములో దురుష్కులనుండియే వచ్చినదనుట యెంత మాత్రము పొసఁగదని విమర్శమున వ్రాసిరి. తురుష్కులపాలనములో దురుష్కులవలనరాక యీయాచారము ఈశబ్దము ఎవరిపాలనములో నెవరివలనవచ్చినదో పాఠకులు విమర్శకులఁ బ్రశ్నించిన సత్యాంశము తేలకపోదు. భాలేరావుగారు సత్యాంశము లోకముకనులు మూకనులు మూసి మరుగుఁబెట్టుచున్నారలుగాని వారికున్న భాలేరావుబిరుదమే తురుష్కులొసంగినదికాదా? ముందుపయోగించుకొను రాజాబిరుదమేమహమ్మదీయుఁడో యొసంగినదికాదా? పేరుచివర నుండఁదగిన బహద్దరుపద మేయవనపాలకుఁడో దయచేసినదికాదా? అటులే యాచరించుచున్న గోషాయు నేతురుష్కనృపాలుఁడో ప్రసాదించినది. ఈయంశమునఁ దప్పక విమర్శకులు తమపూర్వాభిప్రాయము మార్చికొనితీఱవలయును. గోషాపదము తురుష్కులవలన వచ్చినదియే. ముమ్మాటికివచ్చినదే. ఇందులకుఁ బూర్వాధారములటులుండ మఱియొకయాధారమును తారామతియను నాఖ్యాయికనుండి నివేదించుచున్నాఁడను.

"ఆకాలమున యుద్ధమునకువచ్చు ప్రతితురుష్కరాజును బ్రథమమునఁ బౌరస్త్రీలనుజెఱచి యుద్ధముఁజేయుట యాచారమైయుండెను. తత్కారణముననె హిందూసుందరులు ఘోషాపద్ధతి నవలంబించిరి".

ఈతారామతి లక్ష్మీదత్తుడాక్టరుగారియుర్దూభాషాగ్రంథమునకు సరియైన తెలుఁగు. ధీబలసంపన్నులగు నవలాకారు లీయంశము నుర్దూ భాషలో వ్రాసిరి. వీరు మాకొఱకీ గ్రంథమునుగాని ప్రకృతాంశమును గాని వ్రాయలేదు. వంగదేశీయులందరు తమకుఁబట్టువడిన గోషాకు హేతువులుకన్పట్టి లోకమునకుఁ దెలుపుచుండ మావిమర్శకులింక యీయాచారము శబ్దము హిందువులదనిపోరాడుట వెగటుకాకపోదు. ఇంతతో నూఱుకొనక మాభాలేరావుగారు "తురకలప్రభుత్వము పూర్వమున్నకవులే తమతమకృతులలో నిట్టి (తురుష్క) పదములు బ్రయోగించియుండుటవలన నీగోషాపద్ధతి తురుష్కులకాలముననే యేర్పడినదని చెప్పుట కవకాశములుకన్పట్టుటలేద"ని వ్రాసిరి. ఇది భాషాపరిచయము తక్కువగా నుంటచేఁ గలిగిన పొరబాటు. తురుష్క పరిపాలనమునకు మున్నున్నకవులలో నేరేని తురుష్కపద ముపయోగించిరని వాకొనఁగలరా? తురుష్కప్రభుత్వమునకుఁ బూర్వమున్న కవులకుఁ దురుష్కపదము లెట్టులఁబట్టువడఁగలవు! జగ్గయ్యపేటలో నేను గ్రంథాలయసభయందుపన్యసించిన యుపన్యాసముఁ బఠింపమి నిట్టిప్రమాదముపాలైరి. తురుష్కుల పరిపాలనమునకుఁ బూర్వము తురుష్కులపదములు మనగ్రంథములయం దుపయోగింపఁబడలేదు. అటులే తురుష్కపరిపాలనమునకుఁ బూర్వము గోషాయాచారము గోషాశబ్దము మనవాడుకలో లేదు. "మ॥ ఖుసిమీఱన్ సురతాణి నిండుకొలువై కూర్చున్నచో" అని శ్రీనాథకవి తురుష్కపదము ప్రయోగించియున్నాఁడు. ఇతఁడు పదునాల్గవ శతాబ్దారంభమున నున్నవాఁడు. "టోపీ" యనుపదము నాచనసోముఁ డుత్తరహరివంశమునఁ బ్రయోగించినాఁడు. ఇతఁడు పదమూఁడవ శతాబ్దాంతమున నున్నవాఁడు. ఇంతకుఁబూర్వులగు నాంధ్రకవులు తురుష్కపదములు సామాన్యముగఁ బ్రయోగింపలేదు. వీరిరువురు తురుష్కపాలన కీవలివారే. సామాన్యభాషాపరిచయముచే సాధింపఁదగిన యీయంశము మావిమర్శకులు గ్రహింపనందులకు విచారించుచున్నాఁడను.

గోషాకు అవరోధము అంతఃపురము శుద్ధాంతము సమార్థద్యోతకములు కావని యిదివఱకే నిర్ణయించితిని. తురుష్కపరిపాలనానంతర మీపదములనే గోషాకుఁ బర్యాయపదములుగాఁ గొందఱు తలంచియుండిరి. పూర్వగ్రంథములలో నిట్టియర్థ ముపయోగింపఁబడలేదు. "అవరోధము, శుద్ధాంతము, అంతఃపురము, చాటువారు" అను నాలుగు గోషాకుఁ బర్యాయపదములని మావిమర్శకులనిరి. వారి పలుకులు వేదములుగా విశ్వసించుటకు సత్యదేవత నన్ను వారించుచున్నది. పైనుదాహరించిన నాల్గుమాటలలో మొదటిమూఁడు రాణివాసమునకు సమార్థములు. చాఁటువారనుపదము మాభాలేరావుగారు నాకొఱకుఁ గల్పించిరి. చాఁటువారనుపదము రాణివాసఁపుస్త్రీలకుఁగాని గోషాస్త్రీలకుఁగాని వ్యవహారమునం దుపయోగింపఁబడుపదముగాదు. ఈపదము గీర్వాణాంధ్రములయందున్నటుల నాతోఁబాటు లోకమునైత మెఱుంగదు. ఏగ్రంథమునను గాన్పించలేదు. ఇది ఖండనగ్రంథకర్తగారు తమవాదమునిల్పుకొనుటకుఁ గల్పించిన పదము. ఈచాఁటువారనుపదము బహుశగ మాభాలేరావుగారి "కుసుమకోమలి"యను గ్రంథమునఁ బ్రయోగింపఁబడి యుండును. దురదృష్టవశమున నదియే ప్రమాణముకావలసి వచ్చునేమో! చాఁటువారనుపద మవరోధస్త్రీలకున్నటుల భాలేరావుగారు ప్రయోగమును జూపింతురేనిఁ గృతజ్ఞుఁడనై ప్రత్యుత్తరము నొసంగుదును. మావిమర్శకులు, అవరోధము, శుద్ధాంతము, అంతఃపురము, చాఁటువారు" అనునవి గోషాకుఁ బర్యాయపదములని సెలవిచ్చిరికదా! తత్క్షణమే వారు గోషాయనుపదమునకు సరియగునాంధ్రపదములు అవరోధము చాఁటువారని సెలవిచ్చుచుఁ బామరులుగొల్లైదాటుగ గోషాయని వ్యవహరించుచున్నను బండితులు అవరోధజనమనియు శుద్ధాంతకాంతలనియు నంతఃపురస్త్రీలనియు వ్యవహరించుచున్నారని వ్రాసిరి. ఈతిలకాష్టమహిష బంధనము ముచ్చటగ నేడవ పుటలోనికె వచ్చినది. భాలేరావుగారు కన్నులువిప్పి తిరిగి వారివ్యాసము వారేచూచుక

మాఱు చూచి యీపరస్పరవిరుద్ధాంశముల సవరించుకొందురుగాత. సవరించుకొనవలసిన భాగములు చూపుటయు నా నియతధర్మము.

గోషాకుఁ బర్యాయపదములు పరస్పరస్వవచోవ్యాఘాతముల పాలై యున్నవి. గోషాశబ్దమునకు సరియైనయాంధ్రపదములు అవరోధమని చాటువారని విమర్శకులువ్రాసిరి. అవరోధశబ్దముసంస్కృతము. చాటువారనుపదముకల్పితము. దీనిచే నాంధ్రమునఁ బర్యాయపదములు లేవనియే మావిమర్శకులయాంతర్యము. ఈవిరుద్ధాంశములను జక్కఁగదిద్దికొని నాకువినిపింతురేని విరళముగా విమర్శింపఁబ్రయత్నింతును. అంతఃపురాంగనలకుఁ జాటువారనుపేరేలకల్గినదో తోఁచదు. పాపములు పుణ్యములు పరిశీలనములేమి చాటువారనియా! (ఏయభిమానము నెఱుంగక) చాటుననుండవలసిన వారనియా? ఏదీ శబ్దార్థము? తెలిసికొంటిని. గోషాయన మూలగదా దానికిసరియగునది 'చాటు' అను పదమగునని మావిమర్శకులు శబ్దబ్రహ్మలైరి. కాళిదాసాది మహాకవులు సంస్కృతమునను నన్నయభట్టాదిమహాకవు లాంధ్రమునను బ్రయోగించిన పదములు గోషాకుసమార్థద్యోతకములుకావు. రాణివాసమునకు సమార్థములు. ఆవిషయము విస్తరించి మున్నె వ్రాసియున్నాఁడను. గోషా ఆచారము గోషాపదము నవీనమేయనియు దీనికిఁబర్యాయపదము లుభయభాషలో లేవనియుఁ గ్వాచిత్కముగ నేరేని గోషారాణివాసములు సమార్థములనివ్రాసిరేని యదిప్రమాదమనియు నట్టిగ్రంథము నవీనమనియుఁ దలంపవలయును. మావిమర్శకులు నెయ్యి పాలు వంట గంట యనుపదములకుఁ బర్యాయపదములు ఘీ మిల్కు ప్రిపరేషన్ బెల్, అనిపలుకుటలేదా! పైయాంధ్రపదములకు నింగ్లీషుపదము లెటులనేర్పడినవో యటులే రాణివాసమునకు గోషా పర్యాయపదమైనదనియు నింతమాత్రమున గోషాకు సరియగుపదములు మనభాషలో లేవనుట పొరపాటనియు నాకు బోధించిరి. 'బోద్ధారో మత్సరగ్రస్తాః' అను సుభాషితము జ్ఞాపకమునకుఁదెచ్చిరి. పర్యాయ పదములున్నయెడల నన్యభాషాపదములు

వాడుట నవనాగరకతాలక్షణము, పర్యాయపదములు లేనప్పుడు తప్పక యన్యభాషాపదములే వ్యవహరింపవలసి వచ్చును. వాఙ్మయసంప్రదాయమంతయు నీనియమము ననుసరించియే ప్రవర్తించుచున్నది. కాఫీ ధర్మామెటర్ బాంబు డికాక్షన్ లోనగు నాంగ్లేయపదములకుఁ బర్యాయపదములు మనవాఙ్మయమున లేవు. సందర్భానుసారముగ నాయన్యభాషాపదములే వాడుచున్నారము. గులాబి, జమాబంది, తాలూక్‌దారు, ఫసలీ, లోనగు తురుష్కభాషాపదములకుఁ బర్యాయపదములు మనకులేమి నవియే వాడుచున్నారము. అటులే గోషాకుఁ బర్యాయపదము లేమి నాపదమునే మనముస్వీకరించి తురుష్కాచారము పాటించుచున్నారము. పదము ఆచారము తురుష్కసంబంధమైనది. మనసంస్థానములలో వాడు వ్యవహారపదములు బిరుదనామములు శకము తురుష్కపదములైనపుడు గోషాయట్టిదేల కారాదో తోఁచదు. పీర్లపండుగు గోకులాష్టమి కెంతదగ్గఱయో గోషాకు నంతఃపురమునకు నంతదగ్గఱ. గోషానుపామరులు అంతఃపురమునకుఁ బర్యాయపదముగా వాడుచున్నారని మావిమర్శకులాజ్ఞయిచ్చిరి కావున పామరులే గోషాను అంతఃపురమునకు మాఱుగ వాడుటయేగాక యాచరణమందుఁ బెట్టిరనియు రానురానదియే యాచారమైనదనియుఁ బూర్వోదాహరణము లోకమాయనుస్మరించి బునస్థాపన మొనరించుచున్నాఁడను. ఖండనగ్రంథకర్తృ శిరోమణిగారు హిందువులకుఁ దురకలవలన గోషావచ్చినఁ దురకలకెవరివలనవచ్చినదని వ్రాయసాహసించిరి. ఈయంశము తమమిత్రులనేరి నేని ప్రశ్నించిన బాగుండును. ఇదియే చొప్పదంటుశంక. హిందువులకు గోషాయెచ్చటనుండి యేలవచ్చెనో చెప్పితిఁగాని తురకలకెచ్చటనుండివచ్చెనో తెలుపుట మాపనికాదు. ఇది చెట్టుముందా విత్తుముందా యను ప్రసంగమువంటిది. సాధారణముగ నొకసంఘమును జూచిమఱియొకసంఘము ఆచారవ్యవహారములు మార్చికొనుటసైజధర్మము. అటులనె తురుష్కులగోషాయాచారము హిందువులకు సంక్రమించినది. తురుష్కులకేల సంక్ర

మిం చెనోయనుట వివాదలక్షణముకాదు. మాభాలేరావుగారు ధరించు టరనింగ్ కాలర్ కోటు పాశ్చాత్త్యులకుసంబంధించినదనుట యథార్థముగదా! అటులేని పాశ్చాత్త్యులకిచ్చటిదనుట ధర్మమా? తురుష్కుల వలన గోషామనము నేర్చికొనినసంగతి కల్పనమేమైన మావిమర్శకులీ రీతి పెక్కులు వ్రాయవచ్చునుగాని వృథాగా మృషాభాషలు పలుకుట యుచితముగ లేదు.

గోషాయాచారమువలనఁ పద్మనాయకులు దరిద్రులగుచున్నారని నేను ఘోషించుచున్నటుల మావిమర్శకులు మొరలిడసాగిరి. నేను కాను ఘోషించునది. పూర్వమునుండి హిందూకుటుంబములలో గోషా లేదనియుఁ దురుష్కులరాకవలననే యిదిజనించెననియు ధనవ్యయమూలమెగాని లాభము లేదనియుఁ బౌరుషమునకిది భంగకరమనియు గ్రంథములే వేయిముఖముల నుద్ఘోషించుచున్నవి. గోషాహిందూజనులకుఁ బూర్వాచారమనియు నంతఃపురాదులకుఁ బర్యాయపదమనియు నోరుజారిసమర్థింపలేక విమర్శకమహాశయులు ఘోషింపవలెను. ఇంక నెవరుఘోషింతురు. గోషాయెందుకుఁ బ్రాప్తించినదిరాయని యిది మహాఘోషగనున్నదేయని పద్మనాయక స్త్రీసమూహము ఘోషించుచున్నది. ఈసందర్భమున నెవరుఘోషించుచున్నది ఎవరుఘోషింపవలసినది మాభాలేరావుగారు కనిపెట్టలేకపోవుట చిత్రముగానున్నది.

గోషావలన సామాన్యకుటుంబము లప్పులపాలగుచున్నవని నేను వ్రాసియున్నాఁడను. దానికిసమాధానముగ "నొకగోషావలననే యప్పులపాలైనవా రెవ్వరుండరని నిష్పక్షపాతబుద్ధిగల బ్రతివాఁడొప్పుకొనకతప్పదని మాభాలేరావుగారు వ్రాసిరి. మాకిందు భేదాభిప్రాయము లేదు. కొంతవఱకేని ధనవ్యయమనియే మావిమర్శకులభిప్రాయపడియున్నారు. అదియే మనకుఁ గావలసినది. దీనికేమిగాని "అయ్యగారుచేసినఋణమువలనఁ బుట్టువారంట్లనుండియుఁ బీడనుండియు నమ్మగారిగోషాయే యయ్యగారినిఁ జాలవఱకుఁ గాపాడుచున్నదని ప్రతిపక్షులొప్పుకొనక తప్పదని రావుగారువ్రాసిరి. అసత్యమై

నను కల్పనమైనను నేనొప్పుకొనక తప్పదు కాంబోలు. అమ్మగారి గోషా యయ్యగారి నెటులఁ గాపాడుచున్నదో మావిమర్శకులు వివరింపరైరి. ఏమనివివరింతురు! సత్యాంశమున్న నిదివఱకే వ్రాసియుందురు. అమ్మగారిగోషా యయ్యగారిని కాపాడుచున్నదన నయ్యగారును బీడా సందర్భములలో గోషాధరింతురనియు నవరోధస్థములనుండి తప్పించుకొందురనియు నర్థముకానవచ్చుచున్నది. ఇదియేసత్యమైన వీరనామము వహించి చరిత్రరంగమున నుత్తమపాత్రము ధరించిన పద్మనాయకవంశము విమర్శకులసాహసముచే నెట్టినైచ్యములకుఁ బాలుపడెనోయని నేనుసంతాపము నొందవలసివచ్చును. గోషా స్త్రీల విద్యాభివృద్ధికి భంగకరమనియు, వ్రియమెక్కుడనియుఁ, బ్రపంచజ్ఞానము నశించుననియు నీదురాచారము భారతీయకుటుంబములలోఁ దురకలదౌర్జన్యము లేనినాఁ డించుకేని లేదనియు నేను వ్రాసియుండ మావిమర్శకులు కేవల ద్రవ్య వ్రియవిషయమునే సందర్భశూన్యముగ విమర్శించిరి. చర్విత చర్వణమునుమాని ముందునకుఁ బోవుదము. గోషాయున్న దాసదాసీజనులు కావలయుననియు దీనివలన సామాన్య కుటుంబము లప్పులపాలై తీఱుననియు నేనువ్రాసియుండ "గోషాలేకున్ననంగడిచిల్లరవస్తువులు దెచ్చుటకు బజారునకేమిఁ కూరగాయలు కొనితెచ్చుటకు గూరలంగళ్లకేమి, యింకను నాగరికతముదిరినఁ గట్టెలుదెచ్చుటకేమి గోషాస్త్రీలను బంపించుట గౌరవమని యీవ్యాసకర్తగారియభిప్రాయమేమో యని మాభాలేరావుగారు ప్రత్యుత్తరమొసంగుట మిక్కిలి వింతగానున్నది. ఈవ్రాఁతవలన భాలేరావుగారికి గోషాలేని యాఁడువారు కానలకేగి కట్టెలుదెత్తురనియు బజారులకేగి బత్తెముఁ దెత్తురనియు దృఢాభిప్రాయమున్నటుల స్పష్టమగుచున్నది. ఇంతటితో విమర్శకులుపశమించిన బాగుండును. పాపము పద్మనాయక స్త్రీసముదాయమును బజారునకీడ్వవలదనుచు గోషాస్త్రీలను గట్టెలకుఁ గూరగాయలకుఁ బంపుటకు భాలేరావుగా రంగీకరించుట శ్లాఘనీయముగానున్నది. పవిత్రభావములుగల స్త్రీలు గోషాలోనున్న నెంత

సురక్షితురాండ్రు కూరలకుఁ బోయిన నంతయే. భర్తప్రభువుగానున్న భార్యలు రాణివాసములో నుందురు. గర్భదరిద్రులైనఁ గుటుంబయాత్రగడుపుకొనుటకు భర్తకుఁ దోడుపడి కట్టెలకుఁ బోవుదురు. ఇది స్త్రీలశీలసంరక్షణమునకు వ్యతిరేకము నెప్పటికిఁ గల్పింపఁజాలదు. "గోషా"లోనుంచి పెట్టెలలోఁ బెట్టి తాళములుబిగించినను వారిశీలములు కాపాడుట మన కశక్యము. వారిబాహ్యదేహమును బంధించుచుంటిమిగాని హృదయముల బంధింపఁగలమా! అటులే గోషాలేని స్త్రీలు బజారులకేగినను కానలకేగినను వారిసంకల్పము స్థిరమైననచోఁ నెట్టి వికల్పము రాజాలదు. స్త్రీలు కానలకేగినను బజారున కేగినను వారిహృదయము లస్థలనవృత్తిలో నున్నంతవఱకు మిన్నువిఱిగి తమపైఁ బడినను బ్రమాదము జరుగదు. గోషాలేని స్త్రీలను పలువురను మనము గాంచుచున్నారము. అటులే గోషాస్త్రీలును బలువురకుఁ గానవచ్చిన నెట్టిప్రమాదము సంభవింపఁజాలదు. పవిత్రచారిత్రములుగల స్త్రీలయందుఁ బ్రీతి వారికి మాతృభావము జనించితీరును. అటులజనింపదా! అందువలన జరుగనున్న ప్రమాదముఁగూడ నుంచుకేని లేదు. వెయ్యేల పద్మనాయకకాంతలు విధివశమున సంగళ్లకేగికూరకాయలుపట్టించుకొని తెచ్చినను లేదాస్వయముగాఁ దానే తెచ్చినను వారలపవిత్రములగు శీలముల కెట్టికళంకము కలుగఁజాలదని వ్రాయుటకు లేఖిని సంశయము నొందుటలేదని మాబావగారగు భాలేరావుగారు దృఢముగా నమ్మవలయునని ప్రార్థనారూపమున మనవిచేయుచున్నాఁడను.

మావిమర్శకు లింతతో నాగక రానురాను కడుచక్కనిరీతిని వ్రాయుచున్నారు. సత్యముపై విశ్వాసభావములేనితఱి నేవిధముగ నేని వ్రాయవచ్చును. నివారించువారెవరు! చూతము.

"వ్యాసకర్తగారు తమకులఁపుసోదరుల నెవ్వరినో గోషావలన లాభములెవ్వియని యడుగఁగా వారు తగుసమాధానమియ్యలేక పూర్వాచారము మనము మాత్రము దీనినేల వదలుకోవలెను. అని

నుడివిరని వ్రాయుచున్నారు. వీరు తమసోదరులలో నెందఱినడిగిరి ! వారిపేరులెవ్వి ! వీరి వ్యాసమును బత్రికాముఖమునఁ బ్రకటించుటచే నడిగితిమని భావించిరా ! లేక ప్రత్యేకలేఖలఁబంపిరా ? ఈవివరము వ్రాయక యే గోషావలంబకుల నపహసించుటమాత్రము తగనిపని".

అని మాభాలేరావుగారు సువర్ణాక్షరముల లిఖించిరి. ఇందు సత్యాంశము లేశములేదనియు నావ్రాఁత నవగాహనముచేసికొనక యీరీతి రావుగారు వ్రాసిరనియుఁ దెలుపక తప్పినదిగాదు. ఈభాలే రావుగారివ్రాఁతకు రానురాను తలత్రోఁక లేకయున్నది. నేను వ్రాసినదివేఱు. విమర్శించినదివేఱు. ఈశంకకుఁ గావలసినంత ప్రత్యుత్తరము మున్నటివ్యాసమందే కలదు. దాని నిటఁబొందుపఱచుచున్నాఁడ.

"ఇదివఱకీవిషయమున వాదప్రతివాదములు జరిగినప్పుడు నేను దీని(గోషా)వలన లాభములేవియని నాసోదరులనడుగఁగా జవాబు నొసంగలేక పూర్వాచారము మనముమాత్రము దీనినేలవదలుకోవలయునని వ్రాయసాగిరి. ఈప్రత్యుత్తరమందలి సరసత పత్రికాపాఠకులప్పుడే చవిఁజూచిరి." గోషావ్యాసము 8 పుట.

అని నేను వ్రాసితిని. ఇదియంతయుఁ బత్రికలలోజరిగిన వాదమనియుఁ బ్రత్యుత్తరములఁ బత్రికాపాఠకు లెన్నఁడో చవిచూచిరనియు నేనువ్రాసియుండ నెవరినడిగిరి ? వారిపేరులెవ్వి ! యని మావిమర్శకులు ప్రత్యాలీఢపాదముతో నిలిచి యడుగు ప్రశ్నలకు జవాబు నొసంగవలసినయవసరము నాకించుకేనిలేదు. వ్యాసమే సమాధానము నొసంగుచున్నది. పత్రికాముఖమున వాదప్రతివాదములు జరిగినట్లుల నేనువ్రాసియుండ భాలేరావుగారు లేఖలవ్రాసిరా యందురు. ఈ ప్రశ్న చెవిటివాండ్రకథను జ్ఞాపకమునకుఁ దెచ్చుచున్నది. ప్రకృత సందర్భమున కీకథ సరిపడునో లేదో పరికింపఁదలంచినచో కథారత్నావళిఁ దిలకింపఁ బాఠకులు ప్రార్థితులు. అట్లు పూర్వరీతి వ్రాసినవారి నామములే కావలసియున్నఁ గృష్ణాపత్రిక లోనగు తెలుఁగుపత్రికలొకమాఱు చూచికొండని తెలుపుచున్నాఁడ. అసందర్భముగఁ బ్రత్యు

త్తరము లొసంగిన సోదరుల పొరబాటు దాఁచనెంచి వారినా
ములు వెల్లడింపనైతిని. ఇప్పటికేనియు నావ్రాఁతలు
విశ్వసింపరేని పత్రికలపఠించియేని సదభిప్రాయులగుదురుగాక. పాపము
మావిమర్శకులు బొత్తిగా నమాయికదశలోనున్నారు. నాప్రశ్నలకు
సరియగునుత్తరముఁ జెప్పఁజాలక దాటవేసిన విమర్శకులలేఖలు ముద్రి
తములై లోకముననుండ వారిపేరులు గ్రంథమునఁజేర్చి వారికిఁ కళంక
మును గూర్పసందేహించియే గుప్తమొనరించితిని. పత్రికారూపమునఁ
బ్రత్యుత్తరములొసంగినవారుగాక నావ్యతిరేకవాదులు కొందఱుముఖా
ముఖనాతో నీవిషయమువాదించి తమవాదములందలి దౌర్బల్యము
తామేసాకల్యముగా గ్రహించి నాపూర్వాభిప్రాయముతో నేకీభవిం
చిరి. అట్టిసోదరులు గౌరవపదియులే. ఉన్నతకుటుంబములలోనివారలే.
తగుపాటి విద్యాబుద్ధులుగలవారే. వారిపేరులు వివరించుట ప్రకృ
తముకాదు. అటులైన నావ్రాఁత లాధారశూన్యములని పాటుదు
రేమో! దానికి సమాధానముఁ జెప్పకతప్పదు. మాభాలేరావుగారు
తమవ్యాసము మొదటిపుటలోఁ దమకుఁబరమాప్తులు తమ్ముఁబ్రేరేప
నీవిమర్శనముఁ వ్రాసితిమని వ్రాసికొనిరిగదా! ఆపరమాప్తులెవ్వరు.
వారి పేరులెవ్వి! వారెందఱు, వారి రాఁబడియెంత, స్వరూపమెట్టిది?
విద్యాగంధము కలవారా? నాతోఁ బ్రతిఘటించి ప్రత్యుత్తరము
ప్రకటించిన సత్యవాదికుటుంబములోనివారేనా! వారికెందఱు పరి
చారకులు. నల్లగానేయుందురా! అతిమాత్రములగు బొజ్జలుకల
వారేనా! అని మేమడుగవచ్చునా! ఏలయడుగుదుము. మావిమర్శకు
లీవిషయమున సంక్షోభముపెట్టికొన నవసరములేదు. వారిదివ్యమంగళ
విగ్రహములు నాహృదయదర్పణమునఁ బ్రతిబింబించుచునేయున్నవి.
వారాడు మాటలు నాశ్రవణద్వారములఁ బ్రవేశించుచున్నవి. వారి
నామములతో మనకేమిపని. అతిథిచేఁ బాములఁజంపించు నామ
హానుభావులు బయటికివత్తురా! రాఁజాలరు. మావిమర్శకులు తమ్ముఁ
బ్రేరేపణముఁజేసిన వారి పేరులు నాకుజాబులో వ్రాయుదురేని

నాకుఁబ్రత్యుత్తరము నొసంగఁజాలని సోదరులనామములు పత్రికా ముఖమున వెల్లడింతును. వివిధచర్చాభూయిష్ఠమగు నీగ్రంథమున నిట్టియవసరముగాని ప్రసంగములకుఁ జోటునొసంగఁజాలను.

ఖండనగ్రంథకర్తగారూ! ఈవిషయంబులకేమిగాని రాఁబోవు వ్రాఁత మీరతిజాగరూకతతోఁ బఠింపుఁడు. మీమానంబొకతూఁటి నిర్మలముగావించి భారతీయయువతీమతల్లుల విలోకింపుఁడు. మీరీ దిగువభాగముల వల్లించి నిత్యము ప్రాతఃకాలమున పఠించికొనినఁ గాని మీరు మొదటిసారి వ్రాసిన వ్రాఁతపాప మూఁటికపోదు. "గోషా లేనియెడల స్త్రీపురుషులొకరినొకరు చూచుట, ఒకరితోనొకరు భాషించుట, తఱుచుగా సంభవించుటచే వీరికొకవిధమగు నన్యోన్యాను రాగము జనించు"నని వ్రాసితిరి. ఇట్టివ్రాఁతల వ్రాయుట మాతృ జనమునకుఁ గళంకముగలిగించుటయని విస్పష్టముగాఁ దెలుపుచున్నాఁడను. ఎంతకర్ణకఠోరము. ఎంతయన్యాయము. నిష్కారణముగా నీవాక్యమువలన గోషాలేని స్త్రీల నెంతపరాభవించితిరి. పాతివ్రత్య విధానమునఁ దనకు సాటిదేశములు సాటిగావనిగర్వించు మాతృ భూమికి మీరెంతికళంక మాపాదించుచున్నారు. స్త్రీపురుషుల కన్యోన్య విలోకనము అన్యోన్యసంభాషణము సమకూరినయంతన యన్యోన్య సంధానముగ మాఱునా! ఈప్రశంస మీరుగావింపనచ్చునా! సాధ్వీ లోకము మిమ్ముఁదలయెత్తి తిరుగనిచ్చునా! ఈవాక్యము నెంతమంది విమర్శకులు విమర్శించి యెందునకుఁబనికి మాలినదానిఁజేయరు. అప్పుడే మీరువ్రాసినయీవ్యాసమును విమర్శించుచు 1918 సం॥ జనవరి హిందూసుందరి పత్రికలో స్వతంత్రలేఖనమను శీర్షికక్రింద సోదరి శే. రంగనాయకమ్మగారు వ్రాసినవ్యాసముఁ జూడలేదా. ఇంతటితో నీవిషయమునుండి స్త్రీజనము విరమించునా! స్త్రీలు మీకంతటిపనికిమాలిన వాండ్రుగాఁ గానవచ్చుచున్నారా! వీరమతి చరిత్రము జ్ఞప్తికిఁదెచ్చికొనుఁడు. ఆయమ నెంతమందిదుష్టులు పరాభ వింపఁదలఁచికొనలేదు. ఆయమ నెందఱువీక్షింపలేదు. దీనిచే నాయమ

శీలమున కించుకేని మార్పుగల్గెనే! వీరజనగర్భనిర్భేదమగు నీయమ
పరాక్రమము, హిందూజన సేవనీయమగు సాధ్వీత్వము, నీయమతుఁ
దొడుగనితొడవు లనకుండుటకుఁ గద కాసేతుహిమాచల మధ్యవాసి
యగు సంత్యజఁజేని సాహసించునా? ఇంకను మాతృదేశమునందలి
స్త్రీలపాతివ్రత్యములగుఱించి వ్రాయవలయునా! గోషావలన లాభ
ములుగలవని నిరూపించుటకు మీకిట్టిపాపభూయిష్ఠమయిన, దేశవిద్రో
హాకరమయిన దూరాలోచనాశూన్యమయిన, హైందవసాధ్వీ కర్ణ
కఠోరమయిన, వీరయువతీ కోపానల ప్రజ్వలనహేతుభూతమయిన,
హాస్యాస్పదమయిన, నీచాతినీచమయిన, యీకారణముదప్ప మఱి
యొక్కటి కానరాదయ్యెనే! పురుషులందఱు జితేంద్రియులు కారని
భర్తృహరిశ్లోకము మీరొకదాని నుదాహరించితిరి. ఒకభర్తృహరి
శ్లోకమునే నమ్మి జితేంద్రియులు లేరని మనము వ్రాయనవచ్చునా!
ఇంద్రియనిగ్రహము నొనరించి జితేంద్రియతవహించి సుప్రసిద్ధులైన
మును లెందఱు లేరు. భర్తృహరి తాను వైరాగ్యదశలో గ్రంథము వ్రాసి
యుంట చేతను, బరమార్థబోధఁ జేయ సంకల్పించినవాఁడగుట చేతను,
జితేంద్రియులు లేరని వ్రాసెను. ఇది కేవల ప్రశంసామాత్రమే.
భూమిలో జితేంద్రియులే లేనియెడల జితేంద్రియులుండుటయే యసం
భవమయినయెడల నెవరికొఱకు భర్తృహరి వైరాగ్యశతకము లిఖిం
చెనో మా భాలేరావుగారు వ్రాయఁగలరా! స్వేచ్ఛాసంచారులగుఁ
బురుషులలో జితేంద్రియులు పలువురుకలరు. రామకృష్ణపరమహంస
యాధునికుఁడుగదా! ఏభారతీయుఁడు నీయువను ప్రమాదముననేని
యింద్రియవశ్యుఁ డనఁజాలఁడు. ఇతఁడు గృహస్థధర్మము స్వీకరించి
నను గృహిణితో దేహసంబంధములు లేనివాఁడయ్యెఁ దనభార్యవివిధా
లంకరణములు ధరించి యేకాంతమున డాయరాఁగా భక్తిపరవశుఁడై
యొడలుమఱచి నాజననియీరూపమునఁ బ్రేమింపవచ్చెనని వ్రాసిన
గాధ అశ్వనీకుమారదత్తుగారి భక్తియోగమున విరళముగఁ జర్చింపఁ
బడియున్నది. ఈగాధ పరిశీలించియెవరేని జితేంద్రియుఁడు లేఁడని

వారొసఁగలవారుందురా?. పురుషులెందఱు స్త్రీల ప్రాతఃకాలము మొదలు సాయంకాలములోఁగఁ దిలకించుటలేదు. అందఱియెడ వారల హృదయములు రాగవంతములగుచుండెనా? అట్లె గోషాలేని స్త్రీలలో యెందఱు సర్వసంగపరిత్యాగులు లేరు. తరిగొండ వెంకమాంబ పవిత్రచరిత్రము యిందులకు దృష్టాంతరముగ స్వీకరింపవచ్చును. భాలేరావుగారూ! ఏదీమాతము. పరస్పరావలోకనముచే స్త్రీపురుషులకు వలపుజనించునంటిరి. స్త్రీహృదయములు మృదులములంటిరి. ఒక్కసారి పత్రికాముఖమున గోషా లేకున్నఁ బాతివ్రత్యముదక్కదు. పతివ్రతలుండరని ప్రకటించి దేశీయుల నంగీకరింపఁజేయుఁడు. నావాదమును నేను నమస్కారపూర్వకముగ వదలుకొందును. పురుషులు కూడ స్త్రీలఁగాంచి చంచలహృదయులగుదురనియు భర్తృహరివాక్యప్రకారము పురుషులలో జితేంద్రియులు లేరనియు వ్రాయసాహసించితిరిగదా! మీయభిప్రాయప్రకారము పురుషులకుఁగూడ గోషా యవశ్యముకాఁబోలు. పాపము. మీరు మతిస్థిమితము లేక వ్యవహారఁపుఁదొందరలలోనుండి యీభాగములు వ్రాసియుందురు. లేకున్న యుక్తము అయుక్తము పాటింపక యిట్లు వ్రాయరని తలంతును. గోషా స్త్రీలలోఁ గులటలు లేరా! గోషాలేని స్త్రీలలో మహాసాధ్వీమతల్లులు లేరా! మీరొక్కరుగాదు. మీకుఁదోడు గోషాయే పరమార్థసాధకమగునని వాదించువారు పలువురువచ్చినను గోషా స్త్రీలెల్లరు సాధ్వులనియు గోషాలేని స్త్రీలెల్లరు స్వైరిణులనియుఁ జెప్పఁజాలరు. చెప్పఁజాలరు. చెప్పఁజాలరు. ఒకవేళ మీవాద ముద్ధరింపఁ జెప్పుదురేనివారికి మేధాబలము నశించినదనియు స్థిరబుద్ధిలేదనియు నూహింపవలసివచ్చును. మీరొసంగిన బిరుదముతోఁగూడియున్న యాధునికవిద్యావిశారదులగు కట్టమంచి రామలింగారెడ్డిగారి కవిత్వతత్త్వవిచారమున శుద్ధాంతమునుగూర్చి వ్రాసిన పంక్తుల నుదాహరించుచున్నాఁడను. శ్రద్ధతోఁ జదివికొనుఁడు.

“సరి కళలకు గోడలడ్డమా? మనసులకు బీగములు బంధములా? శుద్ధాంతము లేర్పఱచుటయను లఘుకార్యముచే శుద్ధాంత

రంగములు సమకూఱునా ? మఱియు నీమఱుఁగేగదా మానమువిడచు టకుఁ బేరికము. ఎట్లన ఇట్టివారు చెలులు దూతికలు దాసీజనులు మొదలగు మధ్యవర్తులమూలముగాఁ దప్ప నితరములగు నుత్తమ మార్గములఁ దమనైజమగు వలపును దృప్తినొందింపఁజాలరు. మధ్య స్థము నిలిచినపిమ్మట మానముఁగాచి యుండు టెట్లు. మఱుగుగానైన నగముచూపి చూపక యుండు టెట్లు ? శుద్ధాంతమన సేవకులు మొద లగు నీచులతో సావాసమన్నమాట ! గరువతనమునకిది యను కూలమా ! మఱియు నట్టికన్యలకు నితరచింత లేయుండవుగాన తమ చింతయే ప్రధానము. రాజ్యము దేశము జ్ఞానము ధర్మము వీనిం గూర్చిన విచారములు సున్న అప్రయోజకముగా నుంచఁబడియుండు టచే మనసు పరిశ్రమలేక కృశించినశించును. ఇట్టివారు స్వసుఖపరా యణలగు టేమిచిత్రము. మఱి సుఖమనఁగా వీరికి దేహసుఖమనుటఁ దప్ప నింకేయర్థమైనఁ గలనైనఁ దోఁపఁగలుగునా ? ఏపనిపాటలు లేక తిని కండక్రొవ్వి మదాంధలై కాలముభారముగ నుండునట్టి జవ్వనులు శుద్ధాంతములనున్నను సంతసానులట్ల ప్రవర్తింతురు. విచ్చుకత్తుల పారాలెక్కవయాకాలఁది సందుదొరికినంజాలు ! సమయము వ్యర్థ పుచ్చుకత్వరలోఁగార్యము నడుపుకొందమను తొట్రుపాటు కలుగును."

ఖండనగ్రంథకర్తగారూ! శుద్ధాంతపరిభావము శుద్ధాంతఃకరణ ముతోఁ జిత్తగింపుఁడు. సత్యమును గ్రహింపుఁడు. స్త్రీగోషాలోనుం చినంతనఁ బతివ్రతయగునని తలంపరాదు. స్త్రీనిఁబట్టుపట్టి పెట్టెలోఁ బెట్టినను నెట్టనఁదనపట్టునెట్టులేని గట్టెక్కించుకొనఁగలదఁట. దీనికాధా రములు మనకనులముందఱ నెన్నింటినో చూచుచున్నారము. చెడు బుద్ధిపుట్టనేపుట్టదు. పుట్టినేని స్త్రీపురుషుల మఱలింపసాధ్యముగాదు. గోషాయున్నంతమాత్రమునఁ గలటలబుద్ధులుమాఱునా! శీలవతి పురు షులముందున్నను, బహిరంగస్థలముననున్నను, సురక్షితయే. బలాత్కా రించిన హత్యాదిదోషములు సంభవించునంటిరి. సాధ్వి కిట్టిభయము లేదు. కాననికానలనున్నను బతివ్రతల వారిశీలమే కాపాడఁగలదు.

సాధ్వికెప్పుడును శీలభంగముకలుగనేరదు. శీలవతి తనశీలమునురక్షించి కొనఁగలదని మీరెఱుంగరా! పైఁగా స్త్రీలనిర్బంధితలఁజేసి వారిశీలము కాపాడఁజూచుటకంటె వెఱ్ఱితన మింక వేఱులేదు. "స్త్రీఁజూచినంతఁ జిత్తమ్ముగరఁజిల్లు"నని వేమన్నగారిపాదముపట్టితిరి. ఇది యేయంశము కొఱకుదాహరించితిరో నాకుబోధకాకున్నయది. గోషాలేనిస్త్రీలఁ బలువురవీధులలో ననేకులు చూచుచున్నారు. వారిలో నీపద్మనాయకస్త్రీలకంటె ఇతరగోషాస్త్రీలకంటెఁ బలువురు రూపవతు లుండియుందురు. అంతమాత్రమునఁ బురుషులు వారిపైఁ బడుచున్నారా! స్త్రీలహృదయములు మృదులములని సెలవిచ్చితిరిగదా! అవి ప్రేక్షకులకుఁ దమంతన వశమగుచుండెనా! ఈభయము పద్మనాయకస్త్రీలకొఱకు గోషాస్త్రీలకొఱకు పుట్టినదా! విసుగునకు వారకాలకలదా! సాధ్వికి మేరుగహ్వరమునన్నను భయములేదు. కులట రాజాధిరాజులయంతఃపురమునన్నను లాభములేదు. మానసంరక్షణార్థమై యీగోషాదురాచారము పుట్టలేదు. తురుష్కుల దౌర్జన్యము వలననే జనించినది. కావున బ్రిటిషుప్రభుత్వమున నిట్టిభయముతోఁ బనిలేదు. స్త్రీల కిట్టినిర్బంధములుసురక్షితములు కాఁజాలవని మహానుభావుఁడగుమనువు.

"అరక్షితా గృహేరుద్ధాః పురుషైః రాప్తకారిభిః
ఆత్మాన మాత్మనాయాస్తురక్షేయు స్తాస్సురక్షితాః"॥(మనుస్మృతి)

అని వ్రాసియున్నాఁడు. దీనికి "ఆప్తులగుపురుషులచే గృహముననిర్బంధితలగు స్త్రీలు సురక్షితురాండ్రుకారు. ఏ స్త్రీలు తమ్మును తమఆత్మలను గాపాడికొందురో వారేసురక్షితురాండ్రు"అనిభావము. ఈమహానుభావుని శ్లోకమువలనఁగూడ గోషాయే పాతివ్రత్యమునకు హేతువనువ్యర్థవాద మంతరించుచున్నది. మనుస్మృతికారుఁడు స్త్రీలకు నిర్బంధమువలదని ఘోషించుచుండ ఘోషాకావలయునని మనము ఘోషించుట హైందవధర్మములను మంటఁగల్పుటకంటె వేఱుకాఁజాలదు. స్త్రీనిర్బంధము వలదనువారు పెక్కండ్రు కలరుగాన గోషా

కావలయునను వారు పురాణకారులలో నీతిశాస్త్రకారులలోఁ క కారులలోఁ గానరారు. 'సీలము గడ్డిలాగుకొనినటుల స్త్రీపురుషుల యందొకవిధమయిన యాకర్షణశక్తికలదను ------ సందర్భము లేదు. ఉపమానోపమేయములకుఁ బోలిక లేదు. యోజింప సీలముగఱికినిగ్రహించినటులఁ బురుషుఁడు స్త్రీనిగ్రహించును. ఆ గ్రహించుటనే యాకర్షణశక్తియనవచ్చునని వ్రాయఁబోవ నాయంశము నిరర్థకమైయుండును. భరతభూమిలో గోషాయెఱుఁగనికాంతలు పలువురు పాతివ్రత్యధర్మములు పాలించుచున్నారు. గోషానాచరించు స్త్రీలలోఁ బలువురు పాతివ్రత్యధర్మములు త్యజించుచున్నారు. ప్రపంచమొకవిధముగా నుండదు. దుర్గుణముఁగలవా రుభయపక్షములఁ గలరు. సద్గుణములుగలవా రుభయపక్షములఁ గలరు. ఇంతకు నేజెప్పునదేమన గోషావలన హైందవస్త్రీలశీలములు రక్షితములగుట లేదు. వారిశీలసంరక్షణమునకు వారిదృఢతరమగు సంకల్పమే ప్రధానకారణము. గోషా లేకున్న స్త్రీలశీలములు చెడుననియు స్త్రీలుమృదుస్వభావలనియు నసంగతప్రసంగమొనర్చినయెడల భాలేరావుగారూ! మిమ్ము గోషాకలలోనేనియెఱుంగని పవిత్రచరిత్రలగు హిందూకాంతలు క్షమింపరు. సచ్చరిత్రల యాగ్రహ మెంతకేని తగినదని నేను తెలుపనక్కఱలేదు. ఖండనగ్రంథకర్తగారూ! మాటిమాటికి మిమ్ముసంబోధించి మీయమూల్యమగు కాలము వ్యయముచేయుటకంటె మాయుపన్యాసము పాఠకులకే వినిపించుటయుక్తమని తోఁచుచున్నది. మీరికనూకొట్టమానుఁడు.

"ఇంతియగాక (ద్రౌపదికాదు) ద్రౌపతిసత్యభామతో

కం॥ విను ప్రద్యుమ్నాదిభవ
త్తనయులయెడనైన నేకతంబున నేకా
సనముననుండుట దూష్యం
బని యెఱుఁగుము సతులచరిత లతిదుష్కరముల్॥"

అని చెప్పెనని మావిమర్శకులు వ్రాసిరి. ఈభారతపద్యము వ్రాసికొని యంతతో నూఱకయుండక సారాంశముగా నీక్రిందివాక్యరాజముల లిఖించిరి. పాఠకులారా! న్యాయబుద్ధితోఁ దిలకింపుఁడు.

"ఇందువలనఁ బురుషులనుఁజూచుట, సమీపించుట, సంభాషించుట, యనుచితమని తేలుటచే నివి జరుగకుండునట్లు చేయుటకు గోషాకన్న నుత్కృష్టమైన యాచారము మఱియొకటి లేదని ధ్రువపడుచున్నది" అని మావిమర్శకులు వ్రాసికొనిరి. ఈకందము మావిమర్శకుల కందరాని మ్రానిపండైనది. ఇది ప్రకృతాంశనిర్ధారణమున కుపయోగింపదు. దీనికి ఓసత్యా! నీతనయులైన ప్రద్యుమ్నుఁడు మొదలగువారితోడనైనను ఇతరులెవ్వరు లేనిచోట నొక్కపీఠముపై నధివసించుట దూష్యము. స్త్రీలయాచరణములు నియమబద్ధములు అనిభావము. పాపము మాభాలేరావుగారు పద్యమునకుఁ దనకుఁ గావలసినన్ని యర్థములఁ బ్రోగుఁజేసిరి. పురుషులఁజూచుట, సమీపించుట, సంభాషించుట, యనుచితమని మావిమరకుల కాపద్యము వలనఁ దేలినదఁట. ఇట్టినియమబంధనమునకు గోషాకంటె వేఱుగతి లేదఁట. అక్కట! ఏమిసాహసము. పరులను వెఱ్ఱిగఁజూచి "చూపులఁగావె కూటముల్" అను పెద్దనార్యుని వాక్యమునకు లోనగు వారలకుఁ బరస్పర్శసుఖము నపేక్షించువారలకు ఒరులపల్కులపై నిచ్చఁగలవారలకు గోషా యెప్పటికి సురక్షితము కాఁజాలదు. ఈయంశము నేను వ్రాయఁజాలనియంత పరుషముగ యథార్థానుసారముగా రామలింగారెడ్డిగారు వ్రాసియున్నారు. స్త్రీలకు నియమము లేర్పఱచి దానికిఁ లోబడి చరింపవలయునని మనముబోధింపవలయును. ఉల్లంఘనమొనరించినను ద్యజించినను వారలదేభారము. నియమబద్ధలైయుండుటకుఁ గనులకు గంతలఁగట్టి గోషాగదులలో వేయుటఁ దెలివితక్కువ పని. మఱియు నేకపీఠిపై సవతికొడుకుతో నైన నుండవలదనినఁ బురుషులఁ జూడవలదనిగాని సంభాషింపవలదనిగాని స్ఫురింపదు. సత్యభామయు నట్టినియమములు పాటించినటు లగుపడదు. ఇతరులతో నేకాసనమున

నేకాంతమున మంతనమునఁ గూర్చుండరాదు. పుత్రునితోనైనను గూడదని పద్యభావముకాన వేలువేలుపీఠములపై వేలువేలుపురుషులచెంత స్త్రీలు బహిరంగస్థలములఁ గూర్చుండవచ్చుననిభావము బోధపడుచున్నది. దీనిని మాటుపెట్టి భాలేరావుగా రేమేమియో వ్రాయుచున్నారు. దీనివలన గోషా కృష్ణుని యభిప్రాయముచొప్పున లేదనియుఁ బరులతో నేకాంతమున నేకాసనమున వసింపరాదుగాని పురుషులతో భాషింపవచ్చును పురుషులఁజూడవచ్చుననియు వ్యక్తమగుచున్నది. అనుశాసనికపర్వతములో.

"కం॥ పతితనకు నేమియిచ్చిన
నతిముదమునఁ బొందవలయు నాత్మజుఁడైనన్
మతిగొంకక యేకాంత
స్థితి నేకాసనతనుండ్రు సెట్ట ప్రమదకున్"॥

అని పార్వతిపరమేశ్వరునితోఁ గొన్ని పాతివ్రిత్యధర్మముల నెఱింగించెను. కొమరునితో నేని జనని యేకాంతమున నేకాసనవాసము కూడదని దీనిభావము. దీనిని మావిమర్శకులు చిత్తగించి యుండరు. చిత్తగించియేయున్న నింకయెన్నియర్థములు కల్పింతురో! నేనుగోషా విడువుమంటిని స్త్రీల బజారునకీడ్వవలెననియుఁ బరపురుషులతో నేకాంతమున నేకాసనమున వసింపవలయుననియు నేనెన్నఁడు వ్రాసి సాధ్వీమతల్లులకుఁ బరితాపము కలిగించియుండను. నాహృదయ మిట్టి పాపాకర దుర్వచన లేఖనమునకుఁ బురికొల్పదు. గోషా నెన్నఁడు నెఱుంగని సాధ్వీమతల్లులు పలువురు భరతభూమినిగలరు. అట్టివారిలో నేబ్రాహ్మణకాంతనో నిదర్శనమునకుదీసికొని గోషాకాంతలఁ బ్రివర్తింపఁజేయుట యుక్తమనినాభావము. అదియెరాణివాసము. ఏలయన బ్రాహ్మణు లాచారములకు మార్గదర్శకులని మహాభారతము శాంతిపర్వమునఁ జెప్పఁబడియున్నది గాన. ఔరా! మావిమర్శక గ్రంథకర్తగారు గోషాస్థాపింపఁజాలక ఎన్నియసంభవములు, ఎన్నికర్ణకఠోరములు, ఎన్ని పరస్పరవిరుద్ధములు, ఎన్ని భావశూన్యములు, ఎన్ని

యనవసరములు, ఎన్ని యేతెగలోఁగూడఁజేరని యంశములు, వ్రాసిరి. కడకు సాహసించి స్త్రీలఁగాపాడుటకు గోషాకంటె ముఖ్యమైనది వేఱొండు లేదనిసైతము వ్రాసిరి. ఈయంశమునకు గోషాపాటింపని విద్యావతులు గోషా హైందవాచారముకాదను ప్రాజ్ఞులు పత్రికల లోనఁ బ్రత్యుత్తరము వ్రాసి యేల ఖండింపరో తోఁచకున్నది.

స్త్రీలకు గోషాయున్నటు లేనిదృష్టగ్రంథమువలనను మావిమర్శకులు సాధింపఁజాలరు. ఒకవేళసాధింతురేని (సాధింపలేరు) యీదిగువగ్రంథములలోని పరమార్థము లెంతయనుష్ఠాన యోగ్యములో నవియునంతియ యగును.

శ్లో॥ మాతృయో*ంపరిత్యజ్య।విహరేత్ సర్వయో*షు
వేదశాస్త్రపురాణాని।సామాన్యగణికాఇవ॥

జ్ఞానసంకలినీతంత్ర గ్రంథము.

పైశ్లోకమునకు నేనర్థము వ్రాకొన లేనుగాని పుష్పచిహ్నము గూర్చినచోట 'ని' యనువర్ణముచేర్చికొన వలయునని మాతృకాభావ బోధనార్థము తెలియఁబలుకుదును.

శ్లో॥ భస్మనా శుద్ధ్యతే కాంశ్యం।తామ్రమామ్లేన శుధ్యతి
రజసా శుధ్యతే నారీ।నదీ వేగేన శుద్ధ్యతి॥ పరాశరస్మృతి.

స్త్రీవ్యభిచరించిన గర్భధారణము లేకున్న యెడల రజోదర్శనము వలన శుద్ధిఁజెందును. ఆంధ్రపరాశరస్మృతి.

శ్లో॥ మద్యం మాంసంచ మీనంచ। నిద్రా మైధునమేవచ
ఏతే పంచమకారాస్స్యు। ర్మోక్షదాహి యుగేయుగే॥

కాళీతంత్రగ్రంథము.

శ్లో॥ పీత్వా పీత్వా పునఃపీత్వా। యావత్పతతిభూతలే
పునరుత్థాయవై పీత్వా। పునర్జన్మ నవిద్యతే॥

మహానిర్వాణ తంత్రగ్రంథము.

శ్లో॥ నమాంసభక్షణేదోషో॥ నమద్యే నచమైథునే
ప్రవృత్తిరేషా భూతానాం। నివృత్తిస్తు మహాఫలః॥
మనుస్మృతి 6 అధ్యా.

ఇట్లు పవిత్రగ్రంథములలో స్వార్థపరాయణులు జారచోర చక్రవర్తులు కొన్ని ప్రక్షిప్తాంశములు చేర్చిరి. అటులే యేమహాను భావులేని గోషాయే యిహపరసాధనమని వ్రాసి పవిత్రగ్రంథములఁ జేర్చిరేని విమర్శకులు నాకుఁజూపఁ బ్రార్థితులు. అట్టివి లభించెనేని వైగ్రంథములు గణనీయములైననుశ్లోకములునీచభావపూరితములగు టచే నెటులవిసర్జనీయములో యటులె వారుచూపుగ్రంథములు పవిత్ర మయినవైనను ముఖ్యముగ నంశములు పరిత్యాగయోగ్యములని తలం తును. ఇఁక మాభాలేరావుగా రట్టియాధారములకొఱకు పాటు పడుట యుక్తకార్యము.

"గోషావీడుటచే రావణుఁడు సీతాదేవిని హరింపఁగల్గె. ద్రౌప తిని గీచకుఁడు బలిమిని గవయగోరి సభ్రాతృకముగమడసె. రావణుఁ డన్ననో పుత్రమిత్రాదులతో సంగ్రామమునసీల్గె. ఇంతకన్న నేమి లాభములు కావలయు. ఇన్ని దుర్విషయములకేల యెడమీయ వలెను." గోషావిమర్శము.

అని మావిమర్శకులు గోషావలనఁ గలుగుమేలులు బోధించిరి సీతాదేవికి జన్మము మొదలు గోషాలేదు. అవిషయ మిదివఱకె విస్తర ముగాఁ జర్చించితిని. గోషావీడుటచే రావణుచే సీతపట్టువడెనని మాభాలేరావుగారు సెలవిచ్చి తమ పురాణపరిజ్ఞానము వెల్లడించు చున్నారు. సీతకు గోషాలేకపోవుటచేనాయమకెట్టియిక్కట్టు వాటిల్ల లేదు. పరకాంతపై నాసపడిన రావణుఁడే ఘోరసంగ్రామమున నశించెను. అటులె గోషాకలనైవ నెఱుంగని ద్రౌపది కెట్టిముప్పు వాటిల్లలేదు. అయమపై వలపుదాల్చిన కీచకాధముఁడే సభ్రాతృక ముగ మరణించెను. కావున మావిమర్శకు లుదాహరించిన రెండాధార ములవలనను గోషాయెఱుఁగనియాయిరువురు సాధ్వుల కెట్టియపా

యము ఎట్టినియమభంగము జరుగలేదనియుఁ బరకాంతావాంఛచే నష్టులునశించిరనియుఁ దెలియుచున్నది. గోషాలేకున్న సాధ్వులకెట్టి మానహానియు జరుగదు. పైపెచ్చు దురాత్ములెవరేని దురూహాకు లోనౌదురేని తమకు మరణముతామే కల్పించికొందురు. సీత ద్రౌపది మొదలగుయువతీమల్లులకు గోషాలేకుండుటవలననే వారిశీలము వహ్ని జ్వాలవలె పవిత్రితమైయుగనుంటయు వారలవాంఛించుజగత్కంటకులు నశించుటయు సంభవించుచున్నది. గోషాలేకున్న మావిమర్శకులూహించిన నష్టములేమియులేవనియు దుర్మార్గులు నంచినను మనకు దేశమునకు క్షేమకరమనియు అట్టివారునాశనమొందవలసినదె యనియుఁ, బైవిమర్శాంశములవలననే తెలియుచున్నది. మావిమర్శకులు "గోషా వ్యాసకర్తగారు గోషాపద్ధతియందున్న గుణములఁ గ్రహింపక వీరిజనక తండ్రిగారివఱకును వీరు గోషానుఆచరించిన వారలయ్యును వీరిపెంపుడుతండ్రిగారు గోషానాచరించుటఁగన్నులార చూచుచుండియు గోషానాచరించువారు తమకుజవాబుచెప్పలేదనుట యిట్టివ్యాసములను వ్రాయఁగల కుశాగ్రబుద్ధిఁగల మీకుతగునా" అని వ్రాసిరి. మావివాదమంతయు నీయొక్కయంశమునకె సంబంధించియున్నది. పాఠకులారా! చిత్తగింపుఁడు.

మావిమర్శకులు నాజనకునికాలమున నేను గోషాయాచరణమున నుంటిననుభావము సూచించిరి. నాజనకునిజీవితకాలమున నేను బాల్యదశయందు విద్యార్థిదశయందు నుంటిని. నాకప్పటికి వివాహము కాలేదు గావున నాకంతవఱకు గోషా విషయమును యెట్టిజోక్యము కలిగియుండలేదు. నాజనకులు గోషా నవలంబింపఁజేయువారిలో నొకరే. నాదత్తజనకులు గోషాయందెంతటి గౌరవబుద్ధిఁగలవారో వారు గోషానెంతవఱకుఁ బాటించుచున్నారో మావిమర్శకులు బొత్తిగా నెఱుఁగరు. మావిమర్శకులవ్రాఁతపైఁ బరిఁ జూడ నాకుటుంబమున నేనొక్కఁడనే గోషాయందు వ్యతిరేకాభిప్రాయుఁడనని గ్రహించినట్టులున్నది. నాజనకులు స్వర్గస్థులగుట వారిని త్యజించెదను. నాదత్తజన

కులు నాకంటె మావిమర్శకులకంటె ననుభవమునఁ బ్రపంచజ్ఞానమున న్యాయాంశపరిశీలనమున వయోవిషయమునఁ బెద్దలు. గోషాపూర్వాచారమా! కాదా! గోషాయాచారము నెంతవఱకు స్వీకరింపవలయును? గోషా స్త్రీలశీలములు కాపాడఁగలదా! రాణివాసము దానికిసమార్థకములగు శుద్ధాంతాదిపదములు గోషాకు సమార్థద్యోతకములా! అను వంశములకు మాదత్తజనకునివలనఁ బ్రత్యుత్తరములు బడసి వారియాజ్ఞప్రకారము మెలంగ మావిమర్శకు లంగీకరించిరేని నేనును అందులకు బద్ధుఁడను. నేను ముఖ్యముగా వారినే చెప్పుటకుఁ గారణము మావిమర్శకులు గోషా అవలంబకులలో ముఖ్యముగా వారి నెన్నుకొనుటవలననే. ఒకవారె కాదు. మా విమర్శకులుదాహరణమునకుఁ దీసికొనిన కె. వి. లక్ష్మణరావు గారినిగాని కట్టమంచి రామలింగారెడ్డిగారినిగాని న్యాయమూర్తులగు జయంతి రామయ్యపంతులువారినిగాని మఱియేసుప్రసిద్ధులనుగాని మధ్యవర్తులనుగాఁ దీసికొని మావివాదమునకు ముఖ్యాంశములగు పై ప్రశ్నములకుఁ బ్రత్యుత్తరములనడిగి వాదమునాపికొనుటకు నేను సర్వసిద్ధముగానున్నాఁడను. అందులకంగీకరించి వారిమధ్యస్థము నంగీకరింతురేని సారాంశమున నేను బద్ధుఁడనుకాఁగలను. ఈమధ్యస్థత్వమునకు యుక్తపురుషుని వారుకోరుకొనినను నాకుసమ్మతమె. వారియ్యకొనిన నేనేకోరుకొందును. లేదా మండలసభలకనుబంధములగు సంఘసంస్కరణసభలలో గోషానవలంబించు హిందువులసమక్షమున నావాదము ప్రతిపాదించెదను. ప్రతిపక్షులు ఖండింపనరుదెంచినను సమ్మతమె. తీర్మానములననుసరించి యభిప్రాయముల మార్చికొనవచ్చును. లేదా గోషావిషయమై మాపెంపుడు తండ్రిగారి యభిప్రాయమును దీసికొని వాదమునాపికొనినను సంతోషమే! నేను పూర్వవ్యాసమున "స్త్రీవిద్యకుఁగూడ నీదురాచారమె భంగముగల్గించుచున్నది. గోషాపాటించుప్రతివారును స్త్రీలను బదిసంవత్సరములుదాటినఁ బరపురుషులకుఁ గానరానీయరు. ప్రపంచమును జూడనీయరు. ఈలోపుగఁ

ప్రపంచ జ్ఞానమెంత యలవరుచుకొనఁగలరు. ఇంతమాత్రమున నుత్తమవిద్య. ప్రపంచజ్ఞానముఁగల స్త్రీలు (గోషాయాచారముగలవారి కుటుంబములలో) లేరనఁజాలను. వేయికొక్కరేని యుండకపోరు. ......కాని మన స్త్రీలందఱట్టివిద్యావతులైనఁగాని దేశము సంఘము కులము బాగుపడదు" అని నేనువ్రాసియుంటిని. దీనిని మావిమర్శకులు పరాకునఁజిత్తగించి "ప్రథమమున గోషాస్త్రీలు విద్యాగంధశూన్యులనియుఁ దిరుగఁ గొందఱువిద్యాధికలుగలరనియు వ్రాయుటచే వీరివాదమెంతయుఁ బరస్పరవిరుద్ధముగ నున్నది." అని నన్నధిక్షేపించిరి. పాపమీసందర్భమున నన్ను వెక్కిరించుటయే యొకపనిగాఁ బెట్టికొని యాఁడువాండ్రకు విద్యాధికులు, విద్యాగంధశూన్యులు, లోనగు రెండుపుంవాచకములు ప్రయోగించిరి. పద్మనాయకస్త్రీలను బజారునకీడ్వవద్దని తమలోఁదామనుకొనుచు మాభాలేరావుగారాఁడువారికి మగవారికి నొకపుంలింగమునే వాడుట పరిహాసాస్పదముగా నున్నది. ఇప్పటిగోషా, స్త్రీవిద్యాభివృద్ధికి భంగమనియు సంఘమున విద్యావతులు తక్కువయనియు, స్త్రీలందఱు విద్యావతులైనఁగాని కులము దేశము బాగుపడదనియు నేనువ్రాసితిని. ఇది పరస్పరవిరుద్ధమని మారావుగారికెట్టులతోఁచినదో యాశ్చర్యముగనున్నది. విద్యాధికురాండ్రీయాచారము పాటించువారిలోఁ గలరనఁదగినంతమంది లేరనియు స్వల్పసంఖ్యకలవారనియు నాతలంపు. దీనిని విమర్శించుటకు విమర్శకులొకరిద్దఱిని వెదకిచూపిరి. పాపయ్యమ్మారావుగారు, చెల్లయ్యమ్మారావుగారు, చిన్నయ్యమ్మారావుగారు, బాగుగా విద్యనేర్చినవారఁట. వీరుమువ్వురు విద్యావతులే కావచ్చును. అసంఖ్యాకపద్మనాయక స్త్రీసముదాయములో ముగ్గురువిద్యావతులు కలరనుట సిగ్గుచేటు. ధనవంతులకుటుంబములలోఁ దమనామముమాత్రము వ్రాసికొనఁగలవారుండిరోగాని ప్రాయశః స్త్రీలందఱు విద్యాపరిచయములేనివారె. ఈదుస్స్థితికి గోషాయే ప్రథమహేతువు.

"ఇంకెందఱో మహాతల్లులు ఈగోషాచారముగల కుటుంబము లలోఁగలరనుట నిర్వివాదాంశ"మని శ్రీరావుగారు వ్రాసికొనిరి. అంశము ఖండితమైగాని 'మహాతల్లులు' అను శబ్దము చిత్రముగానున్నది. ఇది మతల్లిశబ్దమునకు రూపాంతరముగ భ్రమపడిరో శ్రమపడి విద్యావతు లను నర్థము సాధింతురో వినోదార్థము ముందుముందు పరిశీలింపవలసి యున్నది. గోషాస్త్రీలకుఁ బ్రపంచజ్ఞానము శూన్యమని నేను వాకొన మా ప్రతిపక్షులు ప్రతిఘటించిరి. ఈవిషయమున విషయవిస్తరము కంటెఁ బూర్వోదాహృత రామలింగారెడ్డిగారి వాక్యములు పఠించు కొండని మఱల విన్నవించుచున్నాఁడను. గోషావీడినఁ బ్రపంచజ్ఞానము గడించుట యెట్లోయని మా బావగారు నన్నడిగిరి. ఈవిషయము నేనేల చెప్పవలయును. ఏకుఱ్ఱవానినడిగినను సమాధానముఁ జెప్పఁగలఁడు. గోషాస్త్రీలకు విద్యయేశూన్యమని నేనువాకొనుచుండ భాలేరావు గారు వార్తాపత్రికలు చదువవచ్చుననుచున్నారు. వార్తాపత్రికాపఠ నమున కెట్టిభాషాపరిచయము కావలయునో అట్టిపరిజ్ఞానముకలదో లేదో పరిశీలింపక భాలేరావుగారు తోఁచినటుల వ్రాయుచున్నారు. తాటిచెట్టేలయెక్కితిరన దూడగడ్డికని జవాబుచెప్పుచున్నారు.

"గోషాకలవారు......విద్యాభివృద్ధి...మొదలగువానిం గూర్చి చర్చింపవచ్చుఁగాని పాశ్చాత్యస్త్రీలవలె స్త్రీస్వాతంత్ర్యమునకై పురు షులతో దెబ్బలాడుటకుమాత్రము వీలుండదు"అనిమావిమర్శకులు వ్రాసిరి. ఇదితారుమారువ్రాఁత. దీనియన్వయముబోధించుటకుఁదాను వ్రాసినవ్రాఁతచదువుటకుఁదానే రావలసినటులవిమర్శకులే రావలయును. స్వాతంత్ర్యముకొఱకు కాకపోయినను మగనితో దెబ్బలాడువాఁడు వాండ్రు గోషాస్త్రీలలో లేకపోలేదు. వారలగుట్టు నేనేలబయలు చేయ వలెను. పాశ్చాత్యస్త్రీలుకోరునట్టి స్వాతంత్ర్యము మనకాంతల కవ సరము లేదుగాని మఱియొకవిధమగు స్వాతంత్ర్యము మనకాంతల కావ శ్యకమైనది. స్వాతంత్ర్యావలంబనమునకు మొదటిపని గోషాపరిత్యా గమె.

భారతము అశ్వమేధపర్వములో

కం॥ స్త్రీసంతోషించు తెఱం
గాసపడని మనసుఁగలుగునట్టియధముఁ డి
చ్చోసడిఁగను జని యచ్చో
గాసింబడు జమునిభటులు గారియ వెట్టన్॥

వ్యాసమహర్షియు నిట్లుస్త్రీస్వాతంత్ర్యము స్త్రీజనేచ్ఛాగర్భిత మనియు దానినిబాటింపనివాఁ డిహపరములకుఁ జెడుననియుఁ జెప్పి యున్నాఁడు. ప్రపంచమున స్థావరములకే చైతన్యవికాసము కలుగు కాలమువచ్చుచున్నది. స్త్రీజనులు కార్యవహానమునఁ బురుషులకుఁ గుడిభుజమువలె సంచరించుచున్నారు. స్త్రీలు కామనివారణమునకు సృజింపఁబడిరను వెఱ్ఱితలంపు నాగరకుల హృదయముననుండుటకుఁ జోటులేదు. స్వతంత్రగర్భితమగు బ్రిటీషుపరిపాలనవశమున గోషా దురాచారావశ్యకత నశించినది. భారతకాలమున వేదకాలమున నెట్టి స్వతంత్రము హైందవ స్త్రీలకుఁగలదో యట్టిస్వాతంత్ర్య మిపుడవసర మైనది. సంఘాభివృద్ధికి స్త్రీస్వతంత్రమె మూలము. పాశ్చాత్త్యుల కున్న స్వాతంత్ర్యములు హైందవ స్త్రీల కవసరము లేదు. ఆస్వాతంత్ర్య ములు, ఆదేశస్థితులు, ఆరాజకీయ వ్యవహారపరిణామములు, ఆపూ ర్వాచారములు మన కనుసరణీయములు కాఁజాలవు. అట్టిస్వాతంత్ర్య మును హైందవ స్త్రీలకుఁ గావలయునని యెవ్వరు వాకొనరు.

ఈయంశమునకు సంబంధించిన మహాత్మగాంధిగారి సంఘసేవ యను నుపన్యాసము ముఖ్యముగఁ బ్రతివారును పఠింపఁదగినది. "మన నారీరత్నములు తమ పురుషులతోఁ బాటుగ దేశాభ్యుదయమునకై తగినపని చేయవలసియున్నారా! లేదా! వారికి సంపూర్ణస్వేచ్ఛ రొసంగవలయును. వారినిఁక కేవలమలంకారార్థమగు విగ్రహము లుగాఁ జూడరాదు. అట్లుచూచితిమేని సంఘము పక్షవాతరోగివలెఁ గూలఁబడకమానదు. స్త్రీస్వాతంత్ర్యమునకు ముఖ్యమార్గము వారికిఁ

జదువుఁ జెప్పింపఁబూనుటకంటెఁ బురుషులకు వారియెడఁగల సంకుచిత భావముఁ దొలఁగించుటయని నుడువసాహసించుచున్నాఁడను. విద్య చాలయావశ్యకముగాని స్వాతంత్ర్యము ముందుగానుండవలెను. విద్య చెప్పించువఱకు మనస్త్రీలకు స్వేచ్ఛయొసంగకుండుటతప్పు. అక్షర జ్ఞానము లేకపోయినను మనస్త్రీలు లోకమునందలి యేదేశస్త్రీలకును జిత్తసంస్కారమునఁ దీసిపోరు".

ఈగంధిమహాశయుని యభిప్రాయముకూడఁ బాశ్చాత్యస్త్రీ స్వాతంత్ర్యమును బోలినది మనస్త్రీల కవసరము లేదనియు స్త్రీలకుఁ బురుషులయెడఁగలుగు సంకుచితభావముఁ దొలఁగించుటయే స్వాతంత్ర్యమొసంగుటయనియు సెలవిచ్చినాఁడు. మహామహుల యాదర్శము లన్నియు నిట్టుల నూతనపరిణామములతోఁ గూడికొని జాతీయవృద్ధి సూచకములై యుండఁ బద్మనాయకస్త్రీల నింకయెంతకాలము రహస్య స్థానముల నుంచవలయునో ఇంక యెంతకాలము మననునిదుర పోవలయునో నాకుఁ దోఁచదు. నేను కోరు స్త్రీస్వాతంత్ర్యము గాంధి మహాశయుని యుపన్యాసానుసారమైనదియే.

రాణీమలందేవియు చాందుబీబీయు గోషావనితలుగదా! వారికిఁ బ్రపంచజ్ఞానము లేదా! యని మావిమర్శకులు ప్రశ్నించుచున్నారు. దీనికి రామలింగారెడ్డిగారి ప్రత్యుత్తరము కంఠస్థముఁ జేసికొమ్మనియే జవాబు. చాందుబీబీ మలందేవుల ప్రపంచజ్ఞానము నే చరిత్రకారులు ప్రత్యేకించి ప్రశంసించియుండరు. ఒకవేళ యటు లున్నను వారిప్రపంచజ్ఞానము గోషాలేనిపవిత్రస్త్రీల ప్రపంచజ్ఞానము నకుఁ దీసిపోవునని నేను సాహసించి పలుకఁగలను. సందులేనిబండ్లలో నుండియో గవాక్షరంధ్రములనుండియో యించుక భూభాగమును జూడఁగల మహారాజ్ఞులకుఁ బ్రపంచజ్ఞానమెటులయుట్టిపడును? విశాలమగు ప్రపంచము నొకసారి తృప్తిదీఱఁజూడ మోమెఱుంగనివారికిఁ బ్రపంచము జ్ఞానము కలదనుట పిండిలేనిరొట్టె భుజించుటవంటిది.

గోషా స్త్రీలు సందులేని గుఱ్ఱపుబండ్లలోనుండి సృష్టిచిత్రము లెటులఁజూడఁగలరని నేను వ్రాసియుంటిని. కిటికీలుగాని గవాక్షములు గాని శకటములకుండుననియు దాన శరీరాచ్ఛాదనమెగాని నేత్రాచ్ఛాదనముగాదనియు విమర్శకులు సెలవిచ్చిరి. స్వల్పములగు గవాక్షరంధ్రములనుండి స్త్రీలు ప్రపంచము నెంతతిలకింపఁగలరు. ఎంత తృప్తినందఁగలరు! ఒకయున్నతసౌధమేని గవాక్షరంధ్రముల నుండి కానవచ్చునా? కానఁబడదేని యిదమిత్థమని పోల్చికొన వీలగునా? టాజ్‌మహాలు హైకోర్టు లోనగు మందిరముల గుఱ్ఱపు బండిలోనుండి యెటులఁజూడనగునో. ఏకదేశ దృష్టిప్రసారణమున కర్హములైన రంధ్రములు ప్రపంచదర్శనమున కెటులుపయోగించునో! పాపము విమర్శకులకేమి తెలియును. చిత్రపటములు చూచినఁగలుగు తృప్తికూడఁ గడకు శకటరంధ్రములనుండి చూచినఁగలుగదు.

అట్టి స్త్రీలకుఁ బ్రపంచజ్ఞాన మెంతయుండును. లోకానుభవ మెంతయుండును. స్త్రీలు మృదుహృదయలుకదా! శకటరంధ్రముల నుండి పరపురుషులఁ గాంచిన నేమియగునోయని బండికిటికీలకుఁ గోతములడ్డముగట్టు మహానుభావులు బండ్లకుఁ గిటికీలు లేకుండఁ జేయువారుకూడఁ బెక్కురుకలరు. వారలందఱు గుమ్మడికాయదొంగయెవ రనఁ దమభుజము తాము తడిమిచూచుకొనువారే. ఇట్టి సందిగ్ధావస్థలో నున్న స్త్రీలకుఁ బ్రపంచజ్ఞానముండునంటకంటెఁ బ్రపంచావలోక నానుభవము కలదనుటకంటె నసత్యము వేఱులేదు. లేదు ధనవంతు లలోఁ గొందఱు మనలఁజూచి తాముకూడ నిదియొగౌరవమని గోషా యవలంబించుచున్నారని నేను వ్రాసితిని. మావిమర్శకులు గోషా యందు మహాత్మ్యముండుటచేతనే దానినవలంబించుచుండిరని ప్రత్యు త్తరమొసంగిరి. ఈవ్రాఁత బమ్మరాఁత. దీనికర్థమే లేదు. ఒకరిని జూచి మఱియొకరీగోషాలో ధనమెక్కుడైనను వేలముపెట్టిగఁ బ్రవేశించిరనియు నిదిదురాచారమనియు నేను శాసించుచున్నాఁడను. గోషా యందు చెప్పరానియన్ని చెడుగులుండుటచేతనే యస్మాదృశులు దాని

నాచరణమునఁ బెట్టమానిరనియుఁ జెడ్డసులభముగాఁ బట్టుపడును గావున సామాన్యు లిందుఁ జొచ్చనుండిరనియు నాయభిప్రాయము. దీనిని మావిమర్శకులు కన్పెట్టఁజాలకపోయిరి.

“మహమ్మదీయవనితలకు గోషా మహమ్మదుకాలమునను మొదటికాలిఫాలరోజులలోను గోషా లేకుండ వారివనితలు యుద్ధములో వారిపతులవెంబడి రణగీతములు పాడుచు కత్తిచేఁబూని యుద్ధములు చేసినట్లు శ్రీయుత, కె. వి. లక్ష్మణరావుగారిచే మహమ్మదీయ మహాయుగములో వ్రాయఁబడుటచే పూర్వఁపుఁ దురుష్కులకు గోషా లేదనియు వారు రానురాను గోషా ఆచారము మనలను జూచి యవలంబించిరనియుఁ దెల్లంబగుచుండ వారినిజూచి మనమవలంబించినారమనుట హాస్యాస్పదము”.

అని మావిమర్శకు లొకయంశము ముగించిరి. ఈసందర్భశూన్యఁపు వ్రాఁత ఖండించుట సులభమెగాని వృథాగా గ్రంథము పెరుగుచున్నది. రాణివాసమునకు యుద్ధమున నెటులవిసర్జనీయమున్నదో గోషాకు నట్లెయుండవచ్చును. ప్రాణనాయకులు పరాజితులగుసమయమునఁ దురుష్కస్త్రీలు భర్తృరక్షణకు బయలుదేరియుందురు. ఇంతమాత్రమునఁ దురుష్కస్త్రీలకు గోషా లేదని వ్రాయవీలుండదు. శ్రీ లక్ష్మణరావుగారును మహమ్మదుకాలిఫాలకాలములో గోషా లేదని వ్రాయలేదు. తురుష్కులు హిందువులయాచారము లొక్కటిగాని గ్రహింపలేదు. వారు విజృంభించుకాలమున హిందువులు క్షీణదశలో నుండిరి. కావుననే హిందువుల యాచారము తురుష్కుల కవసరములేకపోయినది. తురుష్కులు హిందువులఁ గాంచి గోషాయవలంబించిరేని హిందూకుటుంబములతోఁ బరిచయములేని టర్కీ మొదలగు తురుష్కసంస్థానాధిపతులేల గోషాపాటించుచుండిరో భావేరావుగా రూహింపరైరి. విద్వాంసుఁడగు మహమ్మదీయు నెవ్వానిగాని పిలిచి గోషా మీకులాచారమా హిందువులవలన మీకులభ్యమయినదా యని మావిమర్శకు లడిగిన పక్షమున వచ్చునదుత్తరము

భాశేరావుగారికిఁ బ్రత్యుత్తరము కాఁగలదు. హిందువులె తురకలకు లొంగి తమబిడ్డలఁ గాన్కగా నిచ్చి, వారివాక్యములు పవిత్రములగు దేశభాషలోఁ గలిపి, వారిమతములోఁ గలసి, వారిదురాచారముల నభ్యసించి, వారికూడిగము సల్పి, సర్వవిధములఁ జెడిరిగాని తురుష్కు లెన్నఁడు హైందవాచారము లవలంబించి జాతిభ్రష్టులు కాలేదు. అటులే మన కేనాఁడులేని గోషా మనవలనఁ దురక లవలంబింపలేదు. కృష్ణదేవరాయల సతులవిగ్రహములు తిరుపతిలోఁగలవనియు నాయన తనపత్నులకు గోషాదురాచారము పాటింపఁజేయలేదనియు నేను వ్రాసియుంటిని. ఈవిషయమై కొన్ని సమాధానములు మున్నుదాహరించియే యున్నాఁడను. దీనికి మాభాశేరావుగారు మద్రాసులో మనోప్రతిమ యెండలోనుండుటఁజూచి యాయనజీవితదశయంతయు నెండలో జరిపెననుట యెటు లసంగతమొ రాయలపత్నులు గోషా పాటింపలేదనుట యటులె యసంగతమని సెలవిచ్చిరి. యుక్తి బాగుగానే యున్నదిగాని యిటమాత్రమది యతుకఁజాలదు. గోషాస్త్రీలపటములు బహిరంగపఱచునాచారము లేదు. గోషాస్త్రీలకు ఛాయాపటములు తీయింపరు. అట్టిఛాయాపటమును దర్శనయోగ్యస్థానముల నుంపరు. పరులకుఁ జూపరు. వారివిగ్రహములఁబ్రపంచమున స్థిరముగానుంపరు. ఇది మ్లేచ్ఛస్త్రీలకు గోషాస్త్రీలకు సమమగు నాచారమె. ఇట్టిచిత్రావస్థలలో రాయలు గోషాపట్టుదలలేనివాఁడుకావున తనసతులఛాయాబింబముల నారకూటముతోఁ జేయించి సమ్మర్దముగల తిరుపతిదేవస్థలమున నుంచెను. ఈవిగ్రహములు సుప్రసిద్ధపరిశోధకులగు శ్రీ జయంతి రామయ్యపంతులువారు శిల్పికృత్యములు కావనియు మాతృకానుసారములనియు యథారూపము లేయనియుఁ బరిషత్పత్రికలో వ్రాసి యున్నారు. గోషాస్త్రీలప్రతిబింబములు బహిరంగముగ నుంచు నాచారము పూర్వము లేమికావునను గౌరుషమువీడి మ్లేచ్ఛాచారము నవలంబించుటయన్న నొప్పనివాఁడుకావునను శ్రీకృష్ణదేవరాయలు తన స్త్రీప్రతిబింబముల బహిరంగముగనుంచెను. కావుననే రాయలపత్నులకు

గోషా లేదని నేను వ్రాసితిని. మా భాలేరావుగారి కిం చేది. యాశ్చర్యమో దీనికుపమానముగ మఱ్ఱోప్రతిమకథ యెటులఁదోఁచెనో నాకు నాశ్చర్యముగ నున్నది.

మనపరిపాలకులగు నాంగిలేయులఁజూచి గోషావలదని నేను శాసించుచుంటిననియు నిది పులినిజూచి నక్కవాతపెట్టుకొనుట వంటిదనియు మావిమర్శకులు సెలవిచ్చిరి. ఇంతవఱకు విమర్శకులు దిట్టినతిట్లకేమిగాని సూక్ష్మబుద్ధికలవాఁడనియు, సాహిత్యజ్ఞానముకలవాఁడనియు, కుశాగ్రబుద్ధిగలవాఁడనియు, బిరుదము లొసంగిరి. ఈబిరుదములకు గోషావలదనుటలోఁ బాశ్చాత్యులఁజూచి పొరపాటు పడుచుంటిననుటకు సంబంధము లేదు. గోషా తురుష్కులయాచారమని నేను ఋజువుచేసితిని. గ్రంథాధారములఁ జూపితిని. తురుష్కపరిపాలనా పూర్వ మీయాచారము హిందూకుటుంబములలో లేదని నిర్ధారణ మొనరించితిని. ఇప్పటికి మతిఁగుదుర్చుకొనక తురుష్కులకువలెనే మనకు గోషాఆచారము కావలయు ననుటయే పులినిజూచి నక్కవాఁతపెట్టుకొని నటులగునని తెలుపుచువాఁడను. నేనిప్పటి పరిపాలకులగు నాంగిలేయులఁ జూచి గోషావలదని చెప్పుటలేదు. ఇటుల భాలేరావుగారు తలంచుట మిగులసాహసము. గోషాను విసర్జింపుమనుట సాయీణులఁ గాంచికాదు. రాక్షసవంశనిర్మూల నోత్పాత ద్యోతక ధూమకేతువుగా గణింపఁదగు సీతచరిత్రమునుగాంచియు సభాసీత్మకకీచక మరణకారణ భూత విలయకాలానల జ్వాలామాలయగు ద్రుపదజాతచరితముఁగాంచియు భర్తృసేవాధీన పవిత్రహృదయాంబుజాతయగు రుక్మిణికథఁ గాంచియు దురుష్కపాలనకుఁ బూర్వ మీభరతఖండమునఁ బాతివ్రత్యజ్యోతి నాయువను తైలధారచే వెలిగించిన హైందవకాంతామతల్లులఁ గాంచియు నని దెలుపుచున్నాఁడను. పవిత్రతరములగు నార్యధర్మములకంటెఁ బాశ్చాత్యధర్మములు గణనీయములని నేనుతలంపను. ఇటులె విమర్శకులు గోషామొదలగు తురుష్కధర్మములు త్యజింపఁగోరెదను.

మావిమర్శకులు మొదటిపుటనుండియు గోషా అనాదిసిద్ధమని వ్రాయసాగిరి. చివరపుటలో ఆదిసిద్ధమని వ్రాసిరి. ఈపరస్పరవిరుద్ధమునకు దిక్కు-మోక్షము లేకున్నది. అనాదియన ఆదికానిదికదా! ముందనాదిసిద్ధమని దేని ననిరో దానిని ఆదిసిద్ధమనుటలో సందర్భము లేదు. సత్యదేవత అడ్డుపడి యసత్యలేఖనానుకూలమగు భాలేరావుగారిలేఖినిని వారించి గోషా అనాదిసిద్ధమని(ఆదిసిద్ధముకాదని) వ్రాయించినది. లేకున్న నీస్వల్పాంశమున స్వవచోవ్యాఘాతము కలుఁగదు.

ఇఁక మాభాలేరావుగారు తమ్ము వ్యాసమువ్రాయఁ బ్రేరేపిన వారలకు నేనొనరించినముండనముఁ జూపించి తమపూర్వాభిప్రాయము మార్చికొని "గోషా" తురకలవలననె మనకువచ్చినదని సాటిపద్మనాయకులకు బోధించి గోషాదురాచారనిర్మూలనమునకు నాకుఁ దోడుపడుదురని శ్రమసల్పి యింతగ్రంథము వ్రాసితిని. పాఠకమహాశయులును నిష్పక్షపాతబుద్ధితో నుభయగ్రంథములు శోధించి సత్యము నెఱుంగఁ గోరెదను.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతి శ్శాంతిః.



# ఉపసంహారము.

రాణివాసము స్వేచ్ఛాభూయిష్ఠమనియు గోషా కఠిన నిర్బంధసంయుత మనియుఁ గనుకనే యుభయశబ్దంబులు సమార్థద్యోతకములు కావనియుఁ బురాణకాంత లాచరించినది రాణివాసముగాని గోషా కాదనియు సాధారసహితంబుగ సమర్థించితిని. భాశేరావుగా రవరోధస్థలమున కన్యాయము సరిగా వర్తింపనేరక పరులను రానీయకుండ నిరోధించుస్థలమగుటవలన గోషా కలగని వ్రాయుట విచిత్రముగా నున్నది. అవరోధస్థులగు రక్షకభటుల కర్తవ్యము పరులను లోనికి రానీయకుండుటేగాని యవరోధజనమును వెలుపలకు రానీయకుండుటకాదని ఖండనకర్తలు కనిపెట్టకపోవుట వింత. ప్రత్యేకించి నేను వ్రాయకుండఁగనే భాశేరావుగా రుదాహరించిన రామాయణ శ్లోకములోని విసర్జనీయాంశములు గోషాకు వర్తింపవుకనుకనే గోషా రాణివాసము నొకటి కాదని తేలుచున్నది.

హూణాంగనలఁజూచి నేను పద్మనాయక స్త్రీలకు గోషాతొలగింపఁ బ్రయత్నించుచున్నానని విమర్శకులు తలంచుట వట్టిభ్రాంతి.

ఏవిషయమునఁగాని నేనుహూణుల నాదర్శప్రాయులుగా భావించువాఁడను గానని భాశేరావుగారు నమ్మవలయును. హూణజనౌఘము కన్న భారతీయులాచార వ్యవహారములయందు వెనుకఁబడియున్నారని నేనెన్నఁటికిని వాకొనువాఁడనుగాను. యవనదౌర్జన్య నివారణోపాయముగాఁ బూనిన యీగోషా దురాచారము నిర్మూలింపఁ బ్రయత్నించుచున్నానుగాని మఱియొకటిగాదు. పురుషులతో సమానస్వాతంత్ర్యార్హమైన స్త్రీజాతిని నింత సెల్లిదముగఁ జూచుచు గోషాపేరిటి జన్మాంతకారాగృహవాసినులుగఁ గావింపఁబ్రయత్నించుటకుఁ గారణము మగవారి నిరాటంక దుష్ప్రవర్తన నిర్వాహణార్థమనియే రూఢియగుచున్నది. గోషావిసర్జనీయమని నేనువ్రాసితినని మీసములు మెలివేసి నాపై భాశేరావుగారు కన్నెఱ్ఱఁజేయుచున్నారుగాని నేనెఱింగినంతవఱకు గోషాపాటించుచున్నామను మహానుభావులెల్లరు బంధువులవద్దఁ మాత్రమీయాచారము నిర్వహించుకొనుచున్నారుగాని తదితరసమయంబులందు గోషావిడచి తిరుగుచున్నారని సత్యబద్ధుఁడనై వ్రాయుటకు వెఱవకున్నాను.

మనము మనమిథ్యావివాదములకు లోనగుటయేగాని దేశకాలపాత్రముల ననుసరించి యాచారవ్యవహారములు మాఱిపోవుట నైజము. ఇందులకు నిదర్శనముగ

పెద్ద పెద్దజమీందారులే గోషాయాచారము విషయములో శ్రద్ధవహింపక స్త్రీస్వాతంత్ర్యాభిలాషులగుచున్నారని విన్నవించుట కమందానంద మొందుచున్నాఁడను. పైవిషయమును ప్రత్యేతరమార్గావలంబనమున కియ్యకొనకున్న శ్రీ భాలేరావుగారే యెఱుంగుదురు. గోషా, స్త్రీలశీలమునుగూడఁ గాపాడుచున్నదనుచున్నారు. ఇది యెంతయు విరుద్ధము. పద్మనాయక స్త్రీల పాతివ్రత్యము గోషాయాచారమున్నంత వఱకేనా! యని గోషాలేని తదితర భారతీయులు పరిహసింతురనియైనను దలంపక మన స్త్రీలయందిట్టి నిష్కారణశంక మాపాదించు వారివాక్యమును వా రుపసంహరించుకొనుట సమంజసమని తలంచుచున్నాఁడను. కొంతమంది పద్మనాయక సోదరులు నన్ను "గోషాతొలగింపుమనుచున్నాఁడవు నేఁటికి బహుసంవత్సరములనుండి యంతఃపురము విడువని వయోవృద్ధలగు మన స్త్రీ లిప్పుడీ నూతనాచారావలంబనమునకు సిద్ధపడుదురా" యనుచున్నారు. నేనైనను నట్టివారు గోషాపాటింపవలదని వ్రాయను. అట్టివారినివదలి చిన్నతనమునుండియే మన బాలికల నీయభ్యాసమునకు లోనుగావించుట నాయభిమతమని మనవిచేయుచున్నాఁడను. గోషాయాచారవిసర్జనీయమునకు సిద్ధపడెడి వయోవృద్ధలైన స్త్రీలెవరైనఁ గలరేని వారివాటంకపఱుపవలదనియు, గోషా విసర్జనీయమని భావించు యువతులకు గోషా నిర్బంధము తొలంగింపవలయుననియుఁ బాలక మహాశయులకు మనవిచేయుచు నాలేఖనికింతతో శాంతినొసంగుచున్నాఁడను.

సమాప్తి.

---